సాహిత్యలత

18వ కుసుమము

# హిందూ మతము




గ్రంథకర్త

శ్రీ కర్లపాలెం కృష్ణరావు

3

# రాజపోషకులు

శ్రీ ఊటుకూరి రామయ్య శ్రేష్ఠిగారు, చీరాల.
శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు, కారంచేడు.
శ్రీ కుమార రాజాగారు, నర్సరావుపేట.
శ్రీమాన్ చక్రవర్తుల రంగాచార్యులుగారు, దర్శి అగ్రహారము.
శ్రీ ఉప్పుటూరి వెంకట పున్నయ్యగారు, యం. యల్., సి.
గుంటూరు.

# పోషకులు

శ్రీ రావు బహదూర్ రావుల సుబ్బారావు పంతులుగారు, చీరాల.
శ్రీ యార్లగడ్డ వెంకటేశ్వర్లు చౌదరిగారు, కుంకలమర్రు.
శ్రీ దగ్గుపాటి పాపయ్య చౌదరిగారు, కారంచేడు.
శ్రీమాన్ గంజాం రాఘవాచార్యులుగారు, M. B. B. S.
మెడికల్ ఆఫీసరు - ఒంగోలు.

శ్రీ రావుబహదూర్ తెల్లాకుల జాలయ్య శ్రేష్ఠిగారు,
మునిసిపల్ ఛైర్మన్ - గుంటూరు.

శ్రీ పూజేటి శ్రీశైలము, పానకాలు & కంపెనీవారు. గుంటూరు.
శ్రీ ఈదర వెంకటాద్రి పంతులుగారు. ఏలూరు.
శ్రీ గరికపర్తి నాగభూషణదేవరగారు, సబ్ రిజిస్ట్రారు.
శ్రీ మద్ది వెంకట రంగయ్యగారు, గుంటూరు.

# తొలి నుడి

శ్రీ కర్లపాలెం కృష్ణరావు గారి నామము ఆంధ్ర వాఙ్మయలోకమునకు చిరపరిచితమే. వారింతవరకు పెక్కు అమూల్యాభరణముల రచించి ఆంధ్రమాత నలంకరించి యుండిరి. "హిందూ మతము"ను నది ఇప్పటికి కడపటిది. వారివరకు సమకూర్చిన మల్లెపూలదండలో నిది పదు నెనిమిదవ పూవు. తక్కిన కుసుమములలో దేనికిని నిది తీసిపోవునది గాదు.

ఆంధ్రుల యొక్క జాతీయజీవితములో పలువురు సంస్కర్తలచే ప్రవేశపెట్టబడిన మార్పులును, వానివలన సంఘమున కొనగూడిన బల సౌష్టవములును చక్కగ నీ "హిందూ మతము" ప్రదర్శించుచున్నది. హిందువులలో సాంఘిక జీవితమును ఆధ్యాత్మిక జీవితమును భిన్నరంగములు గావు గనుక ప్రధానముగ సాంఘిక జీవితమును వర్ణించు నీనవలకు హిందూ మత మని పేరిడుట సమంజసమే.

శైలి మృదువుగను సరళముగను నున్నది. విషయమునకు తగిన భాష యుపయోగింపబడినది. భావములు తీక్ష్ణముగ నుండక సంస్కారమును బోధించునవి యైనను రమ్యముగ నుండి చదువరుల హృదయములను వశపరచు కొనునవిగ నున్నవి.

ఆంధ్రపాఠక మహాశయులు సాదరముగ నీ చిన్న గ్రంథమును స్వీకరించి, మరికొన్ని పూవులను సాహిత్యలత పూచునట్లు తోడ్పడుదురుగాక యని కోరుచున్నాను.

పున్నవ లక్ష్మీనారాయణ.

“ శ్రీ కర్లపాలెం కృష్ణారావు గారు “ హిందూ మతము ” అనే నవలికలో వివాహ విధానాన్ని చిత్రించారు. స్త్రీ పునర్వివాహము చాలా చిక్కులతో కూడినది. ఇందులో చూపిన పాత్రలు అందరూ ఉత్తములే. అందుచేతనే సంఘవిరుద్ధమైనా చివరకు పరిణయం ఫలవంతమైనది. సంశయాస్పదులైనవారు, భీరువులు, ఈ నవలిక చదివి సాహసం తెచ్చుకొని సత్కార్యోన్ముఖులౌతారని ఆశయం. ”

నవ్య సాహిత్య పరిషత్తు,
గుంటూరు,
జూన్ ౧౧, ౧౯౪౨.

శివశంకర శాస్త్రి.

# " అంకితము "

---:o:---

తన ధనంబును కవితా విధానములకు,
తన ధనంబును పేద విద్యార్థులకును,
తన ధనంబును దేవతాస్థాపనలకు,
నిచ్చు, వెంకట పున్నయ్య హెచ్చుగాను.

దేశ సేవను జేసెడు ధీరుడితడు
భోగియును, త్యాగి, వెంకట పున్నయార్యు
డాగి తప్పడు ఆపదలందునైన,
ఇతని కర్పింతు నతిపేద్ద " హిందు మతము ".

గ్రంథకర్త.

# సంపాదకీయము

## శ్రీ ఉప్పుటూరి వేంకట పున్నయ్యగారు, యం. యల్. సి,

---

వీరికి మొదటి నుండియు హిందూ మతము నెడ భక్తి మెండు. మానవునకు దేశ సేవ యెంతటి ముఖ్యమో, మత సేవగూడ నంతటి అవసరమే నని వీరి నమ్మకము. స్వామి శ్రద్ధానందులవారి శిష్యులు శ్రీ కేశవ జ్ఞానిగారి ప్రోత్సాహమున గుంటూరులో వీ రొక "ఆంధ్రశుద్ధి సంఘము" స్థాపించి, అన్య మతస్వీకార మొనర్చిన మూడు వేల భారతీయులకు శుద్ధి సంస్కార మొనరించి, మరల హిందూ మతమున చేర్పించిరి.

శ్రీ వెంకట పున్నయ్యగారు గౌరవ మర్యాదలుగల ఉన్నత కుటుంబమునకు చెందిన వారు. వీరి ఖ్యాతి దశదిశల వ్యాపించినది. అనేక ప్రజా సంస్థలలోను, విద్యా సంస్థలలోను గౌరవోన్నత పదవుల నంది, మన్ననల నందుకొనిరి. మద్రాసు శాసనసభ్యులై యశము నార్జించుచున్నారు. వీరిప్పుడు తెరపిలేక, పౌరాణిక, వ్యవహారిక, స్థానిక, సాంఘిక, సంస్థలందు పాల్గొని అమూల్యమగు మానవ సేవ జేయుచున్నారు.

వీరు చేసిన దాన ధర్మములు లెక్కకు మిక్కుటములు - పేద విద్యార్థులకు భోజనాదికము లిచ్చి విద్య జెప్పించిరి - ఉపనయనములు వివాహములు జేయించిరి - దేవాలయములు, ధర్మ సత్రములు, తటాకములు, ఆరామములు, నిర్మించిరి. విద్యార్థుల వసతి గృహము నెలకొల్పిరి. ఇట్లెన్నియో గలవు—

శ్రీమంతు లగు వెంకట పున్నయ్యగారు 1904 సంవత్సరమున జన్మించిరి. వీరి తల్లి అలివేలమ్మ, తండ్రి నరసింహముగారు— వీరు వైశ్యకులాలంకారులై స్వసంఘమున కమిత సేవ జేయుచున్నారు — శ్రీ వెంకట పున్నయ్యగారి గ్రంథమును స్వీకరించుట ముదావహము—

సాహిత్యలకు బూచిన 18వ కుసుమ మీ "హిందూ మతము" దయా సత్య ధర్మములమీద ఆధారపడి యున్న హిందూ మతము, కరుణార్ద్ర హృదయులును, ప్రేమ స్వభావులును, త్యాగశీలురును, అగు గృహస్థులమూలమున పునీతముకాగలదు - మతమిట్టి కుటుంబముల కాలవాలమై, దీనుల నాదరించి రక్షించినప్పుడే, సంఘముగాని, దేశముగాని, బాగుపడగలదు. ఈ ముఖ్య విషయముల గూర్చి వ్రాయబడిన సాంఘిక నవల యగుట, దీనికి "హిందూ మతము" అని పేరిడితిని. చదువరు లానందింతురు గాక.

సాహిత్యలత
గుంటూరు

కర్లపాలెం కృష్ణరావు,
సంపాదకుడు.

[illegible]

[illegible]



*

*    *

నాగమ్మ ఆత్రంతో యిల్లు నాలుగు మూలల తిరిగి సర్దుతున్నది. చురుకైన పిల్ల కావడముచేత, చకచకా తిరుగ గలదు గాని ఆనాడు అంత ఉత్సాహంగాలేదు. ఏదో భరింపరాని ఆవేదనతో బాధ పడుతున్నట్లున్నది. వంట యింట్లో లక్ష్మమ్మ ఒక మూల కూతురుని పెట్టుకొని కంటనీరు గారుస్తున్నది. ఇల్లంతా నిశ్శబ్దంగా వున్నది. వసారలో మాధవయ్యగారికి యెదురుగా ఒక రైతు కూర్చొని వున్నాడు. నాగమ్మ వచ్చి "అమ్మా! ఇంకేమైన సర్దవలెనా?" అన్నది. లక్ష్మమ్మ ఆమాట వినిపించుకోకుండా, "ఇంత జబ్బుగా వున్నప్పుడు యిన్నాళ్ళనుంచి యెందుకు తెలియ జేయ లేదండీ?" అని వసారలో కూర్చొని వున్న రైతువంక చూస్తూ అన్నది. వంటయింటికి వసారకు మధ్య వక ద్వారబంధము తలుపు వున్నది. వంటయింట్లో కూర్చొన్న వాళ్ళు యెదురుగా. వసారలో వున్న వాళ్ళను చూడవచ్చును. అప్పుడే ఖుష్పేట నుంచి వచ్చిన రైతు శేషయ్య "ఇన్నాళ్ళనుండి జ్వరము వస్తున్నది. అందరూ మామూలు

జ్వరమేనని అనుకొన్నారు. నాటుమందు యిప్పించారు. దినములు గడచిన మీదట అది విషజ్వరమని ఇంగ్లీషు వైద్యులు చెప్పారు. ఇప్పుడు ఇంగ్లీషు వైద్యము చేయిస్తున్నారు. భయము లేదనీ, తాము తప్పకుండా బాగుచేస్తామని డాక్టర్లు అన్నారట. అంతకంటె డాక్టర్లు యేమి చెపుతారు? చెప్పండి!" అన్నాడు లక్ష్మమ్మవంకచూస్తూ శేషయ్య.

అభిమన్యుని మృతిని గూర్చి విన్నప్పుడు అర్జునుని ముఖము కళావిహీన మైనదట! - "గోవిందరావుకు జబ్బుగా వున్నది. జీవితాశలేదు" అని విన్నప్పుడు మాధవయ్యకు ఆపాదమస్తకము మార్పుజెందినది. నిశ్చేష్టితుడై అతడు వసారాలో ఒక పాతకుర్చీమీద కూలబడ్డాడు చదువుకొంటూ చదువుకొంటూవున్న చేతిలోని కాగితములు తెలియకుండా జారి క్రిందబడ్డాయి.

ఆ కుర్చీ పురాతనపుది.— ఒక చేయి వూడిపోయినా, దానినే అతుకు పెట్టించి వాడుకొంటున్నాడు. మాధవయ్య తాలూకాఆఫీసులో స్వల్ప జీతముతో పనిజేస్తున్న గుమాస్తా- నెలాఖరుకు జీతము వస్తే, ఆ వచ్చినవి వచ్చినట్టు ఉప్పువాళ్ళకు పప్పువాళ్ళకు సర్ది, ఒకటో, రెండో మిగుల్చుకొని, మళ్ళీ జీతము వచ్చేవరకు కాలక్షేపము చేసుకుంటాడు. ఈ పూట అల్లుడికి ప్రాణముమీదికి వచ్చినదని వార్త వస్తే, వెళ్ళుటకు ప్రయాణ ఖర్చుకుగూడా యింట్లోలేదు. భయంతో ఆరాటపడుతున్న అతని మనస్సులో చిత్రవిచిత్రంగా అనేక రంగాలు జరుగుతున్నాయి. అర్ధనిమీలిత నేత్రుడై కుర్చీలో కూలబడి వున్నాడు.

నాగమ్మ మాధవయ్య అన్నకుమార్తె - చిన్నతనం లోనే తల్లి దండ్రులు కరువైనారు. మాధవయ్య ఆ పిల్లను గారాబంగా పెంచు తున్నాడు. వయసుకు పన్నెండేళ్ళు అయినా, బొద్దయిన పిల్లగావ డముచేత చూపులకు పదునాలుగేండ్ల పిల్లవలె వుంటుంది. సహజంగా సౌందర్యవతి - వయసు శరీరానికి మరింత అందాన్ని తెచ్చిపెట్టింది. బాగా చదువను, వ్రాయను నేర్చినది. చూస్తే గ్రహించగల ఊహ, ఊహకు దగిన నేర్పు వున్నాయి. వీటన్నిటికి తోడు, నాగమ్మదగ్గర మంచి వినయ విధేయత లున్నాయి. అందువల్ల ఆమెను ప్రతి వారు గౌరవించి ఆదరిస్తారు.

నాగమ్మ వసారాలోకి వచ్చి, " నాన్నా ! ఇంకా యెందుకు కూర్చోటం ' అన్నది. మాధవయ్య ఆ మాట వినిపించుకోలేదు. అతని ఆలోచనలలో అతను మునిగి తేలుతున్నాడు. నాగమ్మను కళ్ళెత్తిచూడనైనా చూడలేదు. నాగమ్మ మళ్లీపలుకరించింది. అప్పుడు తెలివితెచ్చుకొని ' ఏమిటమ్మా ! అంటావు ? ' అన్నాడు. 'ఏమీ లేదు. వెంటనే బయలుదేరితే దీపాలు పెట్టువేళకయినా చేరవచ్చును గదా అన్నాను '

"ఔనమ్మా ! వెళ్ళక చేసేదేమున్నదీ ? బయలుదేరుదాం, యిప్పుడే-! మీ అమ్మయేదీ? " అన్నాడు.

నాగమ్మ మాధవయ్యను "నాన్నా" అని, ఆయన భార్యను "అమ్మా" అని పిలుస్తుంది.

లక్ష్మమ్మ కూతురిని ఓదార్చి, తాను కంటసీరు తుడుచు కొంటూ "అన్ని కష్టాలు మనకే రావాలి?" అనుకొంటూ వచ్చింది. మాధవయ్య ఆమెను చూచి "శేషయ్య యెప్పుడు తినివచ్చాడో అక్కడ - రెండు మెంతుకులుంటే పెట్టండి. తింటాడు." అన్నాడు.

"అన్నం లేకేం? బోలెడంత మిగిలి వున్నది-లేచిరా, శేషయ్యా!" అంటూ, లక్ష్మమ్మ, శేషయ్యకు అన్నము పెట్టమని నాగమ్మతో చెప్పింది.

ఇరుగు పొరుగిండ్లలో యెక్కడనయినా కొంత పైకము చేబదులు తెమ్మనమని మాధవయ్య భార్యకు జెప్పి, పంపి, "భగవంతుడా! ఇలాంటి జబ్బులు నాకు రాకూడదూ? బ్రతికి బట్టగట్ట వలసిన యువకులకా రావలసినది? ఇంకా నన్నెన్నాళ్ళు బాధించు తావు తండ్రీ!" అని భగవంతుని ప్రార్థించుకొంటున్నాడు. ఆయనకు వయస్సు యాభై యేండ్లు మించకపోయినా, కుటుంబబాధలు బాధ్యతలు మిక్కుటమై అతనిని అకాల వృద్ధును జేసినయి. అతని జుట్టు బాగా తెల్లబడి, శరీరము శుష్కించి పోయింది. రాత్రింబగళ్ళు అంతులేని ఆలోచనలు - పాపము! నిద్రపోవుటకు ప్రయత్నించి కళ్ళుమూసుకొంటాడుగాని మనసు మూతబడదు. రాత్రిపూట అలా యెంతసేపు ఆలోచిస్తుంటాడో అతనికే తెలియదు. చాలీచాలని జీతమునకు శరీరాన్ని అమ్ముకొన్నందుల కతడు అనేక పర్యాయములు విచారపడ్డాడు. ఏ వ్యాపారము చేసుకొన్నా, యీ సరికి

కొంత ధనము చేపట్టి, కొంత ఆస్తికి అధికారిగా వుండేవాణ్ని గదా అని అనుకొన్నాడు. వ్యాపారము మాత్రము అంత తేలిక గావున్నదా? అందులోగూడ నష్టపడి కష్టాలపాలైన వారెందరు లేరు? ఎవరి అదృష్టం వాళ్ళది- 'రాజన్ మానవు హానివృద్ధులు మహారణ్యంబులో దాగినన్' అని, మళ్ళీ తానే సమాధానము చెప్పుకొన్నాడు. ఇంతలో శేషయ్యవచ్చి "బాబుగారూ! బండి తెచ్చేదా?" అన్నాడు. "ఆఁ! శేషయ్యా! బాగా పొయ్యే గుఱ్ఱపుబండి తీసుకొని రా, ఒక పావలా యెక్కువైనా, సరే, మంచిదిగా చూడు" అని మాధవయ్య అన్నాడు.

మాధవయ్య ఉన్నదున్నట్లు మాట్లాడే అమాయకుడు. తెలివి తేటలుగలవాడేగాని, ఆలోచనలు స్వతంత్రంగా వుండవు. ప్రతి స్వల్ప విషయానికి యితరుల సలహాలనుతీసుకొంటాడు. దయాదాక్షిణ్యాలు గల జాలిగుండె అతనిది. వ్యక్తిగతంగా ధైర్యంతో యేపని చెయ్యలేడు. మంచిగాని, చెడుగాని, పదిమందితోపాటు నడుస్తానంటాడు. కష్టాలను ధిక్కరించి, నిలువబడే ధైర్యసాహసాలు లేనందువల్ల అన్నింటికీ భయపడుతాడు. ఉన్న యిబ్బందులను సర్దుకోలేక, ఉక్కిరి బిక్కిరి అవుతాడు. నాగమ్మను ఊహ తెలిసినప్పటినుండి, ఉచితమైన ఉపాయాలు, సలహాలు చెబుతూ, మాధవయ్యకు కొంత సహాయంగా వుంది. ఆ యింట్లో యిప్పుడు మాధవయ్య తలపులు తెలుసుకొని సమయానుకూలంగా, ఉపచారాలు చేస్తూ, కనిపెట్టుకొని ఉండేది

నాగమ్మ ఒక్కతే- "ఈ బంగారు బొమ్మను యేలుకొనుటకు యే మహాదృష్టవంతుడు పుట్టి వున్నాడో?" అని మాధవయ్య అను కొంటుండేవాడు. నాగమ్మను ఒకయ్య చేతిలో పెట్టి, దణ్ణం పెట్టిన తరువాత, ఆ యింట్లో తనను గూర్చి, అంత శ్రద్ధగా విచారించే వాళ్లుండరేమోనని, మాధవయ్యకు భయము. - ఈడు వచ్చిన పిల్లను యెన్నాళ్ళు వుంచుకొంటాడు యింట్లో? ఇప్పటికే యిష్టము వచ్చి నట్లు మాట్లాడుతున్నారు లోకులు.

వాకిట్లో గుర్రపుబండి వచ్చి ఆగింది. నాగమ్మ లక్ష్మమ్మ యిల్లుపర్ది, ప్రయాణమైనారు. బండిలో నలుగురు కంటే మించి యెక్క కూడదని బండివాడు అన్నాడు. అందువల్ల శేషయ్యను వెనుకనుండి నడిచిరమ్మన్నారు. శేషయ్య కష్టముచేయగల రైతు. బాగా నడువగల ఓపిక వున్నది. ముప్పేట అగ్రహారము శేకూరికి మూడుమైళ్ళకంటె యెక్కువ దూరముండదు. అందువల్ల శేషయ్య "నేను మెల్లగా నడచి వస్తాను. మీరు బండిలో యెక్కండి" అన్నాడు. బండిలో మొదట మాధవయ్య యెక్కాడు. నాగమ్మ, సీతమ్మ కూర్చొన్న తర్వాత లక్ష్మమ్మ యెక్కింది. "పేపాలు పెట్టే సరికి చేరగలము." అని అంటూ, బండివాడు గుర్రమును కొరడాతో కదిలించాడు. బండిసాగగానే ఒకటి రెండు దుశ్శకునములు యెదురు పడ్డాయి. మాధవయ్య గ్రహించాడు, లోలోన కుమిలిపోతున్నాడు. అప్పుడే బండి కనుచూపుమేర దాటి పోయినది.

# రెండవ ప్రకరణము

పుష్యమాసపు ప్రాతఃకాలము. బాలభానుడు తన శతసహస్ర కిరణములతో తూర్పున గోచరిస్తున్నాడు. పూలమొక్కల మీద చల్లబడిన మంచి ముత్యాలవలె మంచు బిందువులు సూర్యరశ్మికి తళ తళ మెరుస్తున్నయి. అప్పటి కింకా చలి వదలలేదు. చలి కంఠముల బిగించి, గొబ్బెమ్మల బెట్టుకొనుటకు, బాలికలు గుమ్మడి పూలను యెగబడి కోసుకొంటున్నారు. ఏ చిత్రకారుని చేతకూడా కానంత చక్కగా పంగనామములు దిద్ది, అక్షయపాత్రలతో హరిదాసులు వీధుల వెంట తిరుగుతున్నారు. కులసతులు ముంగిళ్ళ ముగ్గులను దీర్చి తమ చాతుర్యమును ఒకరికన్న మిన్నగ మఱియొకరు ప్రదర్శిస్తున్నారు. పిల్లలులేని యింట పడుచుదనములో నున్న భార్యాభర్తలు, నిద్ర మబ్బులతో కళ్ళు నలుపుకొంటూ లేచి, కాఫీకొరకు ఆరాటపడు చున్నారు.

వాసుదేవరావు పడక కుర్చీలో కూర్చొని వార్తాపత్రిక చూస్తు న్నాడు. ఇందిర యింట్లోనుంచి వచ్చి, " రైలు వచ్చేవేళ అయింది కదూ! వెళ్ళివస్తారా, అందాక? " అన్నది. " ఆఁ! వెళ్ళుతాను,

అప్పుడే యెనిమిది గంటలయిందా? చలి యింకా వదలనే లేదు" అని వాసుదేవరావు అంటూవుండగా, సుశీల వచ్చి, "నాన్నగారూ! నేను కూడా మీతో రానా! అన్నది. "రా అమ్మా! బండిమీదనే గదా వెళ్ళేది, రా! పోదాం - మరి, తలన్నా దువ్వుకో లేదేం యింకా?" అన్నాడు.

"ఎంతసేపు నాన్నా! ఇప్పుడు నిమిషములో దువ్వుకోనూ!" అనుచూ సుశీల వెళ్ళింది.

వాసుదేవరావు లేచి, కోటిగాణ్ణి బిలిచి, బండి కట్టమని, తాను దుస్తులను ధరించుకొన్నాడు. ఇందిర కాఫీ ఫలహారము తయారు జేసింది. ఇంతలో తండ్రితోపాటు సుశీలకూడా ఫలహారానికి అందుకొన్నది. ఇద్దరు ముచ్చట్లు చెప్పుకొంటూ, చలికి వెచ్చ వెచ్చని కాఫీ త్రాగి, లేచివచ్చి, సిద్ధంగావున్న గుఱ్ఱపుబండి నెక్కారు. మొట్టమొదట గుఱ్ఱం చలికి నడువలేక కొంత మొండికివేసినా, చురుకైనా కొరడాదెబ్బలు రెండు తగిలేటప్పటికి పరుగెత్తుటకు ప్రారంభించింది. "ఇవ్వాలిటి వార్తలేమిటి నాన్నా! పత్రిక జూచావు గదూ?" అన్నది సుశీల.

"ముఖ్య విషయము—వీరేశలింగం పంతులుగారి జన్మదినోత్సవం యింకా నాలుగు రోజులు. ఇట - రాజమండ్రి, బెజవాడ, గుంటూరు మొదలయిన ముఖ్య పట్టణాలలో మంచి వేడుకలు చేసి, పంతులుగారి చిత్రపటము ఊరేగించుతారు. ఆ మహానుభావుడు సాగించిన ఉద్యమ

వ్యాప్తికొరకు, రాజమహేంద్రవరములో ఒక మాసపత్రికను సాగించు
టకు తీర్మానించారట - మనంగూడా ఆ నాడు మన యిండ్లలో
పూజలు చెయ్యాలి..."

"ఆయనంత గొప్పవాడా!"

"పుణ్యపురుషుడు చేసిన ఉపకారము యెన్ని జన్మలకైనా
మరుపు వస్తుందా! ఎంతమంది అనాథలు యీ సంఘానికి బలిఅయ్యే
వాళ్ళో? ఎన్ని కుటుంబాలు కూలిపొయ్యేవో? అశుభము శుభము తెలి
యని అమాయికలగు బాలవితంతువులు యెందరు గంగపాలయ్యే
వాళ్ళో! వీళ్లను కాపాడి రక్షించుటకు - సంఘాన్ని ఉద్ధరించు
టకు, ఆయన పడినపాట్లు - అనుభవించిన కష్టాలు - చూపిన
త్యాగము - వర్ణింపగలమా తల్లీ!"

"ఆయన చాలా బాధలుకూడా పడ్డాడటగామా?"

"ఔను; అప్పట్లో అధిక సంఖ్యాకులు ఆయన సాగించిన
ఉద్యమాన్ని అరికట్టుటకు యత్నములు జరిగించారు. మూర్ఖులైన
సనాతనులు, దురాగ్రహులై ఆయనను తీవ్రంగా విమర్శించి, హింసిం
చారు. ఆయన యింటిమీద కాకిని గూడా వాలనీయకుండా
బహిష్కరించారు. అంటరానివానికన్న హీనంగా ఆయనను చూచారు.
అశుద్ధము, రాళ్ళు, ఆయనమీద విసరి కొట్టేవాళ్ళు. విశ్వామిత్రుని
యజ్ఞశాలను రాక్షసులు పాడుచేసినట్లు, ఆమహాత్ముడు చేయించే
శుభకార్యాలకు అంతరాయాలు కల్పించారు, ఆయన్ను ఉద్దేశము
నుండి తిరిగి వేయాలని గట్టి ప్రయత్నాలు చేశారు. సత్యాన్వేషణ

తత్పరుడగు ఆ పూజ్యుడు, దురాత్ముల దౌర్జన్యాలను సహించి, సాహసముతో, యేటికి యెదురీదినట్లు, తన ప్రయత్నాలు సాధించాడు. ఆయన ధర్మమార్గానువర్తియగుట వల్లను, ఆయన పనులు న్యాయములై సత్యసమ్మతములగుటవల్లను, దైవమనుకూలుడై, ఉద్యమ ప్రాబల్యమునకు తోడుపడ్డాడు. ఈ నాటికి ఆయన పుణ్యమా అంటూ, యెన్ని సంసారాలో మంగళ ప్రదంగా సాగిపోతున్నయి."

"బాలవితంతూ వివాహాలు శాస్త్రసమ్మతములు గావనేగదా, యీ పురాతనులగోల?"

"అవి శాస్త్రసమ్మతములనీ- ధర్మబద్ధములనీ, ఆచరణీయములనీ అనేక పర్యాయములు, పంతులువారు, వారి అనుచరులూ, ధృవపరిచారు. ఈ విషయమై అనేక వాదోపవాదములు చర్చలు జరిగినయి. పంతులువారి మతము యోగ్యమైనదని పెద్ద పెద్దలే సమ్మతించారు. మానవ హృదయములేని అతివాదులు కొందరు మాత్రమే, పట్టుదలకొరకు పెనగులాడుతున్నారు."

"పోనీ, వాళ్ళకిష్టం గాకపోతే, అనుసరించకుండా మానుకోరాదూ? ఇంత తీవ్రమైన ప్రతిఘుటన మెందుకు!". "అలా వూరుకొంటె, అనుకొనుటెందుకు? లోకములో అనేక రకాల మనుష్యులున్నారు.- అనవసరంగా పరుల వ్యవహారాలతో జోక్యం కలిగించుకొని, హింసించి, వినోదిస్తుంటారు. భగవంతుడు వీళ్ళకేలాటి శిక్ష విధిస్తాడో?" "ఔను, నాన్నగారూ! మీరన్నట్లు ఆయన మేలు

171



ఆంధ్రులు మరువ తగిందిగాదు. అనాథ శరణాలయాలుకూడా కట్టించాడట, మొన్న అమ్మగారు చెప్పింది. పరోపకార బుద్ధితో ఆయన జీవితాన్ని సార్థకపరుచుకొన్నాడు. శాస్త్రాలు గీస్త్రాలు-".

"అసలు దీనికింత తర్కవితర్కాలు అనవసరము. ఆయన అందరిని సుఖపడమని చెప్పాడుగాని, అగ్నిగుండములో దూకమని చెప్పలేదు గద! చేయరాని అక్రమాలు-అసహజాలు చేసి, అవినీతిపాలై, అమానుషకృత్యాల కాలవాలమై, హేయముగానున్న సంఘాన్ని బాగుజేశాడు. శాస్త్రాన్ని అడ్డముపెట్టుకొని, కృత్రిమ నాటకాలు ఆడుచున్న స్వార్థపరులైన, సనాతనుల ఆటకట్టించి, దిక్కులేనివారికి దిక్కు జూపిస్తూ, దైవదత్తమగు శరీరాలను, సద్వినియోగం జేయమని చెప్పాడు. దీనికి రాద్ధాంత సిద్ధాంతా లెందుకు?"

"అదీగాక, - ఈ అత్యాచారులు జేసే పను లన్ని సక్రమమైనవా? శాస్త్రసమ్మతముగాని పనులు యెన్నో చేస్తున్నారు గదా? వాటి కేమి సమాధానము చెబుతారో...?"

" ఏమి చెబుతారు? నోరుమూసుకొని పోతారు..."

" ఆయన మంచి కవీశ్వరుడట. ఆయన వ్రాసిన శకుంతలలోని పద్యాలు కొన్ని మొన్న మా గురువుగారు చదివారు."

"పంతులవారి ప్రజ్ఞ సర్వతోముఖమైంది. కండగల జాతీయ భాషలో ఆయన రసవత్తరమైన కావ్యాలు అనేకం నిర్మించారు. కవుల చరిత్ర వ్రాసి ఆంధ్రులను మహోపకారం జేశాడు. తెలుగులో

మొట్టమొదట ఆయనే నవల వ్రాసింది. ఆయన "రాజశేఖర చరిత్ర" కు పూర్వం మనకు నవలలు లేవు. ఆ కాలములో వ్యయ ప్రయాసల కోర్చి, ఆయన పత్రికను నడిపాడు..."

బండి రైలుస్టేషనుకు చేరి ఆగింది. వారి సంభాషణ ఆపి, దిగి స్టేషనులోకి వెళ్ళి విచారించగా, రైలు ఇంకా పది నిమిషములకు వస్తుందన్నారు. ఉభయులు అక్కడ బల్లమీద కూర్చొని పత్రికలోని వివిధ సంగతులు చెప్పుకొంటూ, మళ్ళీ వెనుకటి విషయం జ్ఞాపకమునకు రాగా, "నాన్నా! వీరపూజలు దేశమంతా చేస్తే యెంత బాగుంటుంది? అన్ని పండుగలమాదిరిగా..." అన్నది సుశీల.

"వీరులను పూజించుట మన విధి - వారి జీవితములను ధారవోసి, ప్రసాదించిన వారి కష్టఫలమును, అనుభవిస్తూ, వాళ్లను మరచి పోయిన వాళ్ళకు గతులుంటయా! వారలను గౌరవించక పోవుట మనలను మనమే అగౌరవ పరుచుకొనుట గదా? ప్రతి యేటా వీరపూజలు జరుగుటవసరము. ఆంధ్రులలో త్యాగమూర్తులైన ప్రతిభా సంపన్నులు "ఆంధ్ర రత్నము" మున్నగువారు పలువురున్నారు. అలభ్యరత్నము నిజముగ "ఆంధ్రులపాలిట రత్నమే-"

"ఆయన రాజకీయంగా పని చేశాడా?"

"ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా వివిధశాఖలలో తమ ప్రజ్ఞా విశేషములను ప్రదర్శించారు. సంఘమునకు రాజకీయము

కూడా ఒక అంగమే - అన్ని అంగములు చక్కగా నున్నప్పుడే, సమాజముగాని దేశముగాని బాగుంటుంది.

"గోపాల కృష్ణయ్యగారు చీరాల పేరాల వారి కొరకు విశేషంగా శ్రమపడ్డారట-"

"కాదు- అది అసత్యము. ఆయన ఒక గ్రామానికనిగాని, ఒక వ్యక్తికనిగాని ప్రత్యేకంగా సేవ చేయలేదు. భారతీయులందరికి ఆయన సేవను అర్పించాడు. చీరాల పేరాలలో ఆయన కొన్నేళ్ళు నివసించాడు. అందువల్ల ఆ గ్రామస్తులకు ఆయన సాన్నిధ్యము తరుచుగా లభించేది. అప్పుడప్పుడు వాళ్ళకు కావలసిన సలహాలనిస్తూ అవసరమైన పనులను చేసిపెట్టేవాడు. ఈ కారణాలవల్ల చీరాల పేరాల ప్రజలకు ఆయన విషయంలో యెక్కువ బాధ్యత వున్నమాట నిజం".

"చీరాలలో ధనికులు పుష్కలంగా వున్నారట గదా? వారైన ఆ ధీరుని విగ్రహాన్ని ఆంధ్రదేశంలో నిర్మించి, ఆనందించగూడదూ?"

"నిజమే!- వాళ్ళకెందువల్లనో ఆ ఆలోచనలు కలుగలేదు"

రైలువచ్చి స్టేషనులో ఆగింది. ఇద్దరు లేచివెళ్ళి రైలుపెట్టెలను చూస్తూనే వున్నారు. చివర పెట్టెలో నుంచి కమలాకరరావు రెండు బుట్టలు, పెట్టె, పరుపులతో దిగాడు. కమలాకరం పలచగావున్నను అందంగా వుంటాడు. పసుపు పచ్చరంగు బంగారు వన్నె,- విశాలమైన నేత్రాలకు తగిన మొఖము - సొగసైన క్రాపు చక్కగా

వున్నయి. సన్నజల్తారు ధోవతి, సిల్కుషర్టు, విలువైన పాదరక్షలు ధరించాడు. ముంజేతికి ఖరీదుగల చిన్న గడియారము బంగారు గొలుసుతో అమర్చబడివుంది. కెంపులతో బిగించిన వుంగరము వ్రేలిన మిల మిలలాడుతూ, సూర్యకిరణములు పడినప్పుడు వింతవింత రంగులను ప్రదర్శిస్తున్నది. అంతపొడుగు అంత పొట్టిగాక మధ్యరకంగా వుంటాడు. సుశీల గబగబా వెళ్ళి అన్న చెయ్యి బట్టుకొని, క్షేమ సమాచారాలు విచారించి, "పండుగ సెలవులు యెన్నాళ్ళు యిచ్చారు. అన్నయ్యా!" అన్నది. "మధ్య శని ఆదివారములు వచ్చుటచేత ఆరుదినములు సెలవు- ఈ సంక్రాంతి మొగవాళ్ళకంత ముఖ్యమైంది కాదుగదా" అన్నాడు కమలాకరం.

వాసుదేవరావు కూలివానితో కమలాకరం సామాను తెమ్మన మని చెప్పి "పోదాంరండి" అన్నాడు. కమలాకరం రైలు అధి కారులకు టిక్కెట్టు యివ్వగానే ముగ్గురు కలిసి వెళ్ళి బండిలో యెక్కారు.

## మూడవ ప్రకరణము



ప్రస్తుతం మన దేశంలో పరిష్కరించుటకు వీలులేకుండావున్న సమస్యలలో ముఖ్యమయినది నిరుద్యోగ సమస్య. ఇది అంటువ్యాధి

లాగున దేశమంతటా వ్యాపించింది. నిజంగా అంటువ్యాధి కంటె అపాయకరమైంది కూడాను. అంటు వ్యాధులను నిర్మూలించుటకు ఆరోగ్యశాఖవారు చాలా శ్రమపడి, విశేషధనము వ్యయము జేస్తున్నారు. అంతకంటె హానికరమైన, యీ నిరుద్యోగ సమస్యనుగూర్చి ఆలోచించినవారు యెవరులేరు. నిరుద్యోగిగా నున్న యువకునికి దుశ్చింతల వలన అనేక వ్యాధులు కలుగవచ్చును. దానివలన అతనికేగాక, ఆ గ్రామమున కంతటికి నష్టమేగదా? ఒక్క క్షణం ఆలోచిస్తే, ఈ నిరుద్యోగులవల్ల దేశమునకు యెన్ని రకాల నష్టమున్నదో, యెంత హానికలుగుతుందో బోధపడుతుంది. ఇంతటి ముఖ్యమును, అత్యవసరమును అయిన విషయాన్ని ఆలోచించినవారు ఇంతవరకు కనుపించలేదు. కాంగ్రెసుమంత్రులు మనవాళ్ళుగదా వాళ్ళ ప్రభుత్వములోనయినా కొంత ఉపకారము జరుగుతుందేమోనని చాలా మంది ఆశపడ్డారు గాని, వాళ్ళు, అంతకు పూర్వమున్నవాళ్ళే మేలనిపించి సద్దుకొన్నారు. ఈ గోల యిలా వుండగా ప్రతి సంవత్సరము వందలు, వేలు, విద్యార్థులు కళాశాలల నుండి యోగ్యతా పత్రములతో తయారై వస్తున్నారు. ముందు వాళ్ళను చూచి అయినా గ్రహించి వూరుకొనక, తల్లిదండ్రులు తమ బాలురను విద్యాలయాలకు పంపిస్తూ ఆస్తిపాస్తులను పోగొట్టుకొంటున్నారు. కేవలము ఉద్యోగాలకు మాత్రమే యీ విద్య పనికివస్తుందని అందరికి తెలుసును గదా? "చదివిన వారికే ఉద్యోగాలు లేక అల్లాడుతుంటే,

యింకా యెందుకండీ, మీ పిల్లవాడికి యీ విద్య చెప్పిస్తున్నారు?" అని యే తండ్రినయినా అడిగితే, "అంతకంటే చేసే దేమున్నది?" అంటాడు. ఆ మాట నిజమే! లోకం పాపిష్టిది. ఎటుబడితే అటు మాట్లాడుతుంది. చదువించకుండావుంటే, "ఆ అబ్బాయికి చదువులేదు, సంధ్యాలేదు, బజార్ల వెంట తిరుగుతుంటాడు" అని అంటారు. ఆ పిల్లవాడికి తుదకు పెళ్ళికూడా కానీయకుండా చేస్తారు. – పోనీ, ఈ ఇంగ్లీషు చదువు మాన్పించిమన దేశ పరిస్థితులకు అనుకూలించే జాతీయ విద్య చెప్పించుదామంటే,- అలాంటి సదుపాయాలు మన కసలు లేవు. కాబట్టి తల్లిదండ్రులు యెన్ని కష్టాలైనా పడి, తమపిల్లలను యీ విద్యాలయాలకు పంపక తప్పదు. తరువాత ఉద్యోగాలు దొరకనీ, దొరకక పోనీ,—ఇదీ యిప్పటి పరిస్థితి—

సూరయ్య బెజవాడలో స్కూలుఫయినలు చదువుతున్నాడు. పెండ్లి కావలసిన పిల్లవాడు. యెలాబోయి యెలా వచ్చినా యిబ్బంది అని తండ్రి అతనికి చదువు చెప్పిస్తున్నాడు. బెజవాడలో అతని విద్యాభ్యాసమునకుగాను నెలకు ఇరవై అయిదు రూపాయిలు ఖర్చు అవుచున్నవి. విద్యార్థి దశలోనున్న వారిలో చాలా మందికి ధనార్జనమున గల కష్టములు అర్థము గావు. సూరయ్యచూస్తే గ్రహించగల తెలివితేటలుగలవాడు. కాని, ఆ తెలివితేటలు అతనికి విద్యార్థి దశలో అక్కరకు వచ్చుటలేదు. అతనికి చదువంటే తలనొప్పి; స్కూలుకుగూడా సరిగా వెళ్ళేవాడుగాదు. అలాంటి రకమే అతని క్లాసులో యింకా యిద్దరున్నారు. వీళ్ళు ముగ్గురు గలిసి, చీట్లాడుతూ,

సినిమాలవెంట దిరుగుచూ, పోకిరి పనులు చేస్తుండేవాళ్ళు. సూరయ్య ఇతరులను అల్లరిజేసి యేడ్పించుటలో మొనగాడు. చాలా చమత్కారంగా మాట్లాడుతుంటాడు. అతనికి లలిత కళలంటే మిక్కిలి అభిమానము. భారత భాగవతాలు, శృంగార ప్రబంధాలు చదువుతూ, అప్పుడప్పుడు వచ్చీ, రాని, పిచ్చి పద్యాలు వ్రాస్తుండేవాడు. స్నేహితులెవరైనా „ అన్ని తప్పులతో పద్యాలు వ్రాయకపోతే, వూరుకోరాదా!" అని అంటే, „వ్రాయగా, వ్రాయగా తప్పులే ఒప్పులౌతయి" అనేవాడు.

ప్రతి నెల యితనికి యింటియొద్ద నుండి తండ్రి పంపించే యిరవైఅయిదు రూపాయిలు ఒక వారము దినములుగూడా సరిపోవు. ఒక్కొక్కప్పుడు స్కూలు జీతముగూడా కట్టేవాడుగాదు. ఇతని స్నేహితులలో యిద్దరు, ముగ్గురు ధనవంతులున్నారు. వాళ్ళు అప్పుడప్పుడు కొంత సహాయము చేస్తుండే వాళ్ళు. ఎంతటివాళ్ళనయినా సునాయాసంగా తనకు లోబరచుకొనే చతురత సూరయ్యకు మొదటినుంచీ వున్నది. అందువల్ల అతను ధనలోపమున యెప్పుడు బాధపడలేదు.

ఒకనాడు ఒంటరిగా గదిలో పడుకొని సూరయ్య „ వాణి" చదువుచున్నాడు. ఆ మాసపత్రికలో ఒక కథ చదివి కొంతసేపు ఆలోచించి, కొన్ని పద్యాలు చదివి, „ఈ మాత్రము నేను వ్రాయలేనా?" అని అనుకొంటూ, లేచి పెన్సిలు కాగితము తీసుకొని అప్పుడే ఒక గంటలో నాలుగు పద్యాలు వ్రాశాడు. వాటిని మళ్ళీ

మళ్ళీ చదువుకొని, మార్చవలసినచోట మార్చి, చక్కగా వ్రాసి, వాటిని ఆ నెల సంచికకు పంపవలె ననుకొన్నాడు. ఆ పద్యాలు తన పేరుతో పత్రికలో బడగానే ఆంధ్రులందరు చూచి, ఆనందిస్తారనీ, అలాగే రెండు మూడు పర్యాయములు పత్రికలలో తన వ్యాసములు బడితే, తనకు అపరిమితమైన గౌరవము లభిస్తుందనీ అందరు ఆదరించి, మర్యాద మన్ననలు చేస్తారనీ, తా నొక కవిరాజై, మంచి మంచి కావ్యాలు నిర్మించవచ్చుననీ, తనకు కనకాభిషేకము జరుగుతుందనీ, మొదలైన ఊహాలు యెన్నెన్నో ఉదయించి, అతన్ని యే రమ్య హర్మ్యాలకో చేర్చినయి. ఈ ఆలోచనలలో అతనికి అప్రియత్నంగా నిద్రవచ్చింది.

మరుపటుదయాన సూరయ్య ఆ పద్యాలు తన స్నేహితు లిద్దరు ముగ్గిరికి చూపించాడు. చూచిన వాళ్ళందరు చాలా బాగున్న యని మెచ్చుకొని, "వీటిని తప్పకుండా పత్రికకు పంపవలసినదే" నని అంటూ అతనికి మితిలేని ఉత్సాహము కలిగించారు. ఆ సాయంకాలము సూరయ్య తన పద్యాలను స్కూలుకు తీసుకొని వెళ్ళి స్కూలులో తెలుగు పండితునకు చూపి, "వీటిని పత్రికకు పంపదలచుకొన్నాను. తప్పులుంటె దయయుంచి సరిద్దిపెట్టండి" అని అడిగాడు. ఆ తెలుగు పండితుడు సహనములేని ముక్కోపి — తన విద్యార్థి ఆ మాత్రము వ్రాశాడుగదా అని, సంతోషించి, సలహానిచ్చి, సరిద్ది పెడదామన్న బుద్ధి ఆయనకు పుట్టలేదు. ఆయన ఆ కాగితాలను చూచి,

చూడకముందే, క్రిందపారవేసి, "ఏడ్చినట్టున్నయి. ఇలాంటి పిచ్చి పద్యాలెప్పుడు వ్రాయబోకు" అని తీవ్రంగాఅన్నాడు. ఆమాటలు సూరయ్యకు చాలా ఆగ్రహం కలిగించినయి. అంతటి పరాభవాన్ని సూరయ్య భరించలేకపోయినాడు. ఒక క్షణం ఆగి "పండితుడికి పద్యాల సంగతి యేమి తెలుసును లెండి! మీకు తెలుసు ననుకొని భ్రమపడుట నాదే తప్పు" అని అంటూ అతను అక్కడినుండి వెళ్ళిపోయినాడు. ఆ పండితుడు అలాగే నివ్వెరపడ చూస్తున్నాడు సూరయ్య వంక......

తరువాత సూరయ్య తన పద్యాలు పత్రికకు పంపి, ఆ సంగతి మిత్రులందరికి చెప్పాడు. కొన్నాళ్ళు గడిచింది. నూతన సంచిక రాగానే సూరయ్య అతని మిత్రులు ఆతృతతో చూశారు. అందులో సూరయ్య పద్యాలు లేవు. ఆస్తిఅంతా పోగొట్టుకొన్నవానికివలె అతని ముఖం తెల్లబోయింది-మిత్రులందరు పకపక నవ్వారు. ఆనాడు మయసభలో జరిగిన అవమానమునకు దుర్యోధనుడు గూడా, యిప్పుడు సూరయ్య పడినంత బాధ పడియుండడేమో?

"ఏ కారణము వల్ల నా పద్యాలు మీరు ప్రచురింపలేదో దయచేసి తెలియజేయవలసిన" దని సూరయ్య మరునాడు పత్రికాధిపతులకు జాబువ్రాశాడు. "మీపద్యాలు పత్రికలో వేయదగినంత బాగా లేవు. కొంత కాలము మీరు పద్యాల జోలికి పోకుండా చదువుకొంటే, బాగుంటుందని, మాసలహా" అని జవాబొచ్చింది.

ఆ వుత్తరం చదువుకొన్నప్పుడు సూరయ్యకు శరీరమంతా తేళ్ళు పాములు తిరిగినట్లుంది. ఏమీ తోచలేదు. కోపము ఆపుకోలేక పోయినాడు.— "ఈ పత్రికాధిపతులకెంత పొగరు? వాళ్ళొక్కళ్ళే తెలివిగలవాళ్ళని, మిగిలినవాళ్ళంతా వెర్రివాళ్ళనీ అనుకొంటారు గాబోలు! ఇంతకంటె అసహ్యంగావున్న పద్యాలు యెన్ని, వాళ్ళు స్వీకరించి, ప్రచురించుట లేదు? ఆ రచయితలంతా వాళ్ళచుట్టాలా? లేకపోతే లంచాలిస్తారా? ఏమో! అదికూడా నిజమే అయి వుంటుదిం.—" అని ఏమేమో ఆలోచించాడు.

దినములు గడుస్తున్నయి. పండుగని స్కూలుకు నాలుగు రోజులు శెలవులిచ్చారు. సెలవుల్లోకూడా సూరయ్య వాళ్ళవూరు పోకుండా బెజవాడలోనే వున్నాడు. వాళ్ళవూరు వెళ్ళితే అతని కేమీ తోచదు. అక్కడ అతనితో కలిసి సరదాగా తిరిగే వాళ్లెవ్వరు లేరు. అదీగాక, సూరయ్య పరీక్షన చక్కగా లేదనీ, ఇక ముందైనా జాగ్రితగా మెలగకపోతే, కడతేరడం కష్టమనీ, తండ్రి సూరయ్యను విమర్శిస్తుంటాడు. ఇలాంటివన్నీ సూరయ్యకు కష్టంగా వుంటయి. ఇంటి వ్యవహారాలు సూరయ్య బాగా అర్థం చేసు కొన్నాడు. కష్ట నిష్ఠూరాలన్నీ గ్రహించాడు. కాని, తాను విచారించి చేయదగినదేమీ లేదనీ, ఆ విషయాలు ప్రస్తుతం తనకు అనవసరమనీ , అనుకొన్నాడు. అయినప్పటికి నాగమ్మ మాత్రము మధ్య మధ్య అతని కళ్ళల్లో మెదులు తుంటుంది. సొంత చెల్లెలు

గాక పోయినా, నాగమ్మంటే సూరయ్యకు పంచప్రాణాలు. ఆ పిల్ల స్థితిని జూచి అతడు జాలిపడుతుండేవాడు. నాగమ్మ లక్షణాలనుబట్టి చూస్తే గొప్ప అదృష్టవంతురాలవుతుందని అతడూహించేవాడు. నాగమ్మకు సంబంధం మాటలలో తాను జోక్యం కలిగించుకొని, తనకు నచ్చిన పెండ్లికొడుకును యేర్పాటు చేయవలెనని అనుకొన్నాడు. పాపము! తన మాటలు యెంతవరకు పాటిస్తారో సూరయ్యకు తెలియదు.

పద్యాలు చదువుకొన్నప్పుడు అవి తనకు చాలా బాగున్నాయి. మంచి భావము - వాటికి తగిన భాష - అనాయాసంగా కుదిరి, రసవంతంగా వున్నాయి. వాటిని విన్న మిత్రులందరు "దివ్యంగా వున్నాయి" అన్నారు. అప్పుడు సూరయ్య ఉబ్బి, తబ్బిబ్బయినాడు — ఇప్పుడు అవే వ్యసన కారణాలయినవి. సూరయ్యకిప్పుడు పద్యాలగోల ఒకటే బాధిస్తున్నది. పత్రికాధిపతులు వాటిని ప్రచురించక పోవుట— ఆ నాడు తెలుగు పండితుడు తన పద్యాలు చూడకుండా ఆ విధంగా అవమానపరుచుట - ఈ రెండు అతను మరిచి పోలేకుండావున్నాడు. కోపము, రోషము, అతనిలో పెనవేసుకొన్నాయి. ఆలోచించగా ఆలోచించగా అతని కొక దారి దొరికింది— "ఇతరులను ఆశ్రయించినంత బుద్ధితక్కువ పని యింకొకటిలేదు. నా వస్తువు మంచిదగునో కాదో, నిర్ణయించుకొనే జ్ఞానము నాకు వున్నది. పరుల పచ్చదనము జూచి ఓర్వలేని పాడులోకముతో నా కేమి పని? నా పద్యాలు

నేనే అచ్చు వేయించుకొంటాను. వీరిని, వారిని, ప్రార్థించు టెందుకు? వాళ్ళంతా మొనగాళ్ళా? వాళ్ళ మాత్రం నేను చేయలేకపోను. నేను గూడా ఒక పత్రికను సాగించి నడిపిస్తే, అనేకులు నన్నే ఆశ్రయిం చుకొని తిరుగుతుంటారు. ధన సహాయమునకు ఒక రిద్దరు స్నేహితు లను పట్టుకొంటాను. నాకోరిక లెలా సిద్ధించవో చూస్తాను..."అని సూరయ్య పరిపరి విధాల అనుకొంటున్నాడు.

# నాలుగవ ప్రకరణము

లక్ష్మమ్మ చిత్రమైన ప్రకృతిగలది. స్వార్థపరత్వము మెండు. తాను – తన పిల్లలు – తన భర్త – తన యిల్లు – యిలావరుసగా అన్నిటికి లెఖ్ఖ వేస్తుంటుంది. తాను అందరిమీద పెత్తనం చేయ వలెనని, అందరికంటె మించిన ఉన్నతస్థితిలో నుండవలెననీ, ఆమె భావించేది. తన స్థితి కవి వాంఛనీయములగునో, కాదో, అని ఆమె యెప్పుడు యోచించి యుండలేదు– తీరని కోరికలతో గగన కుసుమాలకు చేతులుజాచేది. గాలిమేడలు కట్టుకొంటూ కాలము గడుపుతుంటుంది– సాధారణంగా ఆశకు హద్దులేనప్పుడే, లోకంలో కష్టాలకు అంతువుండదు.

తన కొడుకు డిప్యూటీ కలెక్టరు గావలెననీ, తన కూతురు లక్షాధికారికి భార్య గావలెననీ, అదినుండి ఆమె సంకల్పము. నాగమ్మ కంటె సీతమ్మ చిన్నదైనా, ముందు సీతమ్మ పెండ్లి చేయ వలసిందేనని పట్టుపట్టింది. పెద్దకట్నాలు యివ్వలేమనీ, త్వరపడకుండా కొంతకాలమాగితే మంచి సంబంధాలు వస్తాయనీ, మాధవయ్య అనేక విధాల చెప్పాడు. పెద్దపిల్ల నాగమ్మను వదలి పెట్టి, సీతమ్మకు ముందు పెండ్లి చేయుట ధర్మముగాదనీ, లోకాపవాదమునకు గురి గావలసి వుంటుందనీ, మాధవయ్య చాలా దూరము ఆలోచించాడు. పాపము! అతని మాటలు సాగలేదు. లక్ష్మమ్మ భల్లూకపు పట్టుతో మాధవయ్య చల్లగా జారి "సరే" నన్నాడు.

ముప్పేటలో రామయ్యగారు, ఇంత, చాలిన వాళ్ళనీ, ఆది నుండీ, వాళ్ళది పరువు మర్యాదలు గల కుటుంబమేననీ, పిల్లవాడు గూడా చక్కగా చదువుకొంటున్న బుద్ధిమంతుడనీ, మాధవయ్య విచారించి, ఆ సంబంధము నిశ్చయపరచాడు. రామయ్యగారికి గోవిందరావు ఒక్కడే కొడుకగుటవల్ల యెంచుకొనే వాళ్ళు పంచు కొనే వాళ్ళు, లేరనీ, ఆ స్తిఅంతా తన కూతురికే వస్తుందని, లక్ష్మమ్మ సంతోషపడ్డది. వెయ్యిన్ని నూటపదహార్లు కట్నమిచ్చి, సీతమ్మకు తొమ్మిదో యేటనే పెళ్ళిచేశారు. సీతమ్మకు అత్తవారు ఆయిదు వందలు సొమ్ము పెట్టారు. గోవిందరావుకు అప్పటికి పదమూడేండ్లు. సీతమ్మ గోవిందరావుల పెళ్ళి, బొమ్మల పెండ్లివలె చక్కగా

జరిగింది.—పాపము! ఇలా అవుతుందని యెవరు కలగన్నారు? దైవ విధి కెవరు బాధ్యులు?

మాధవయ్య భార్యాపిల్లలతో ముప్పేటజేరిన ఆ రాత్రి రెండు గంటలకు గోవిందరావు ప్రాణాలు విడిచాడు. ఏడుపులతోను, పెడబొబ్బలతోను, ఆ యిల్లు నిండిపోయింది. అంత ఆస్తి వుండీ ప్రయోజనము లేకపోయింది. విధి నెవరు తప్పించగలరు?

బెజవాడలో నన్న సూరయ్యకు వెంటనే తంతివార్త నిప్పించారు. సూరయ్యా ఆ మరునటి దినమువచ్చి, రెండు దినములుండి వెళ్ళాడు. గోవిందరావు మరణసమయములో తల్లిదండ్రులకు గాని భార్యకుగాని యేమీ చెప్పలేదని ఆడంగులు అనుకొన్నారు. లోక మంటే యేమిటో తెలియని లేతవాడు, యెవరి కేమి చెప్పగలడు? తన కొక భార్య వున్నదనీ, ఆ పిల్ల జీవితము తనపై ఆధార పడి వున్నదనీ కూడా, పాపము, గోవిందరావుకు తెలియదేమో!— ఆ తరుణములో అందరు యేడుస్తుంటే, సీతగూడా యేడ్చిందిగాని, నిజంగా తన భావిజీవితవిధానాన్ని తలుచుకొని, కలిగిన కష్టాన్ని అర్థం జేసుకొని, దుఃఖించినదని యెవరు చెప్పగలరు? తన జీవిత సర్వస్వమును కబళింప, నోరు తెరుచుకొని, సిద్ధముగా నున్న, రాక్షస సంఘమును గుర్తించుటకు ఆమెకు శక్తి చాలదు - ఆ భయానకదృశ్య మిప్పుడామెకు గోచరింపదు— పదిమందితోపాటు ఆమెగూడ కంట నీరు గార్చింది. ఆ కన్నీటి కణాలు అర్థరహితములే!

కర్మాంతరాలు పూర్తి కాగానే ప్రయాణము కావలసినదని మాధవయ్య, లక్ష్మమ్మను హెచ్చరించాడు. "పిల్ల సంగతి యేమంటారో, రామయ్యగారిని అడుగరూ ? ఇప్పుడే ఆ విషయాలన్నీ తేల్చుకొనుట మంచిది. తరువాత అసలు పలుకరు-" అన్నది లక్ష్మమ్మ.

"ఇప్పుడు వాళ్ళు పుట్టెడు దుఃఖములో మునిగి వున్నారు అలాంటివేమి యిప్పుడు మాటాడగూడదు - అయినా, అసలు ఇప్పుడు మాటాడుటకు మాత్రమేమున్నది ? దైవ నిర్ణయ మెలా వున్నదో, అలా జరుగుతుంది".

"అయ్యో ! ఆదేమిటండీ, అలా అంటారు ? నూరేండ్లు బ్రతికి బట్ట కట్టవలసిన పిల్ల - దానిసంగతి రేపు ఎవరు విచారిస్తారు! ఎల్లకాలము వీరు నేను బ్రతికి వుంటామా ? పోయిన మొగుడు పోగా, తినుట కింత తిండిఅయినా వుండవద్దా ? "

"పిల్ల తిండికేమీ లోపముండదు. ఆ విషయములో నీవు భయపడ నక్కరలేదు. రామయ్యగారితో యీ సంగతులు యిప్పుడు మాట్లాడుట మన కెంతమాత్రము మర్యాదగాదు. వాళ్ళు మాత్రము అంత తెలియని వాళ్ళా! రామయ్యగారు యితరులచేత చెప్పించుకొనే రకముగాదు. అయినా కొడుకు పోయినంత మాత్రాన కోడలు కోడలుగాకుండా పోతుందా?"

"బాగానే వుంది యీవరుస! మీకు తెలియనప్పుడు యెవరైనా చెపితే వినాలి. లోకంలో అందరు మీవంటివాళ్లే వుంటారా? మీ మాటలు విని వూరుకొంటే, ఆపిల్ల బ్రతికినంత కాలము "అన్నయ్యో, రామచంద్రా!" అని యేడుస్తుంది..."

"అలా కఠినమైన మాటలు అనకు - ఎవరైనా వింటే నవ్వుతారు."

ఇంతలో నాగమ్మవచ్చి, "నాన్నా! ఇడుగో బ్రాహ్మణుడు వచ్చాడు" అని పురోహితుణ్ణి చూపింది.

"దయచేయండి! శాస్త్రిగారూ! మేము ఈ పూట వెళ్ళ వచ్చునుగదా?" అన్నాడు మాధవయ్య.

"ఇంకేమి పని వున్నదీ? అమ్మాయిని కూడా తీసుకొని వెళ్ళుతారా?"

"ఆఁ! తీసుకొని వెళ్ళుటకే నిశ్చయించినాను. పసిపిల్ల, యిక్కడెందుకు లెండి!"

ఇంతలో లక్ష్మమ్మ "శాస్త్రిగారూ! పిల్ల సంగతి యిప్పుడే మాట్లాడు కొనుట మంచిదిగాదూ! చెప్పండి!" అన్నది

"ఔనమ్మా, అలాంటివేమైనా వుంటే, యిప్పుడే తేల్చుకొనుట మంచిది. లేకపోతే పెవరు పలుకుతారు!"

ఈ మాటలు వినగానే మాధవయ్యకు కోపము వచ్చింది. ఏమిచేయుటకు తోచక అక్కడినుంచి లేచి వెళ్ళాడు. అతను లేచి వెళ్ళుటే మేలని తలచి లక్ష్మమ్మ బ్రాహ్మణునికి సంగతి సందర్భా

అన్ని చెప్పి, "పిల్ల సంగతి యేమంటారో" రామయ్యగారిని అడిగిరమ్మన మన్నది. 'సరే' నని వెళ్ళి శాస్త్రి రామయ్యను కలుసుకొని లక్ష్మమ్మగారు చెప్పిన పాఠమంతా చదివాడు. రామయ్యకు నోట మాట రాలేదు. కొంతసేపు మౌనము వహించి, ఒక వేడినిట్టూర్పు విడిచి "ఏమిటి శాస్త్రిగారూ, మీరనేదీ!" అన్నాడు.

"మాధవయ్యగారు యీ పూట వెళ్ళుతారట - పిల్లనుగూడ తీసుకొని వెళ్ళుతారట - ఆ సంగతి...పిల్ల సంగతి...?"

"పిల్ల యిక్కడే వుంటుంది"

"పసిది గదండీ, తల్లి దండ్రులను వదిలి వుండగలదా?"

"..........?"

"అందుకని యేదో మాట చెప్పమని కోరుతున్నారు".

రామయ్యకు ఆగ్రహం వచ్చింది. "శాస్త్రీ! వాళ్ళు తెలివి తక్కువగా అడుగమంటేమాత్రము, నీ వెలా అడుగుతున్నావు? ఏమిటీ మాటలు? కత్తితో కోస్తున్నట్టున్నారే? ఇంత నీచంగా ప్రవర్తిస్తున్నాడేం మాధవయ్య?— రా! వెళ్ళి అడగుదాం" అని అంటూ శాస్త్రిని వెంటబెట్టుకొని మాధవయ్యను సమీపించి, "ఏమండీ! శాస్త్రిని నా యొద్దకు అడగమని మీరే పంపారా?" అన్నాడు. ఈ బుద్ధితక్కువపని లక్ష్మమ్మ చేసిందని మాధవయ్య గ్రహించాడు. అలాంటి అవకతవకలు జరిగినందుకు సిగ్గుపడుతూ, మాధవయ్య "రామయ్యగారూ! క్షమించండి! నేను పంపలేదు. వ్యవహార జ్ఞానములేని స్త్రీలు తొందరపడ్డారు" అని అన్నాడు.

రామయ్య బ్రాహ్మణుని వంక తీవ్రంగా జూచాడు. ఇంతలో రామయ్య భార్య సుబ్బాయమ్మ వచ్చి, "ఆ మాటలు నేనుగూడ విన్నాను. వాళ్లే తెగ్గోసుకొని వెళ్ళుతామని అంటునప్పుడు మన కెందుకు? ఏదో సమాధానము చెప్పండి" అని, కంటనీరు పెట్టు కుంటూ అన్నది. మాధవయ్య యేదో చెప్పుచుండగా రామయ్య విన కుండా, "చెప్పేదేమున్నది? పిల్లదగ్గర అయిదువందలకు సొమ్ము వుందిగదా? అది ఆ పిల్లను తీసుకొనమనండి,- ఆ పిల్లకు యిష్టముంటే, మా యింట్లోనే వుండమనండి - మా పిల్లమాదిరిగా చూచుకోగలము" అని అన్నాడు. మాధవయ్య "రామ! రామ! బాధ్యత తెలియని స్త్రీలమాటలకు మీ రింత ఆగ్రహించుట మేలుగాదు" అని అంటూ మెల్లగా సర్ది, రామయ్యను శాంతింపజేసి వచ్చి, లక్ష్మమ్మను నానా లిట్లు తిట్టాడు.

ఎవరి యిష్టమువచ్చినట్లు వాళ్ళు బయటికి రాకుండా, గుసగుస లాడుకొన్నారు. ఆడ వాళ్ళేలా వున్నప్పటికీ మొగవాళ్ళు పట్టించు కోకుండా మెలిగేవాళ్ళుగనుక తగాదాలు తన్నులాటలు లేకుండా సమసిపోయింది. ఆ సాయంకాలమే బండిమీద, మాధవయ్య భార్యాపిల్లలను తీసుకొని, వాళ్ళ వూరికి వెళ్ళాడు. బయలుదేరే టప్పుడు మాధవయ్య రామయ్యను పలుకరించి, సెలవుదీసుకొన్నాడు గాని లక్ష్మమ్మ సుబ్బాయమ్మతో మాట్లాడలేదు. కుటుంబాలలో సాధారణంగా వచ్చే చిన్నచిన్న పోట్లాట లన్నిటికి, స్త్రీలే కారణ మని, మాధవయ్య అనుకొన్నాడు.

శ్రీ వేమన ... 
తెలుగు భాష (కథ)

# ఐదవ ప్రకరణము

శేకూరు అంత పల్లెటూరుగాదు, అంత పట్నముగాదు. డిప్యూటీ తహశీలుదారుకచేరీ, రిజస్ట్రార్ఫీసు, పోలీసు స్టేషను, ఒక చిన్న వైద్యాలయము, తపాలా కచేరీ, ఆ వూళ్ళో వున్నయి. ఎక్కువమంది అధికారులుగాని, విద్యాధికులు గాని, ఆ వూళ్ళో లేరు. చెప్పదగిన వే నాలుగైదు కుటుంబాలో తప్ప, అందరూ సామాన్యులే - ఎన్నదగిన ఆ నాలుగైదు కుటుంబాలలో వాసుదేవ రావుగారిదొకటి. వాసుదేవరావుగారు డిప్యూటీ కలెక్టరుచేసి, పింఛను పుచ్చుకొన్న తర్వాత జీవిత శేషమును నిరాడంబరముగా గడుప వచ్చుననీ, అన్ని సౌకర్యాలు వున్నవని, శేకూరులో నివాస మేర్పరచుకొన్నారు. ఈయన చాలా గంభీరంగా ఉంటాడు. నియోగి బ్రాహ్మణుడు గనుక సహజంగా లౌకిక మున్నది. ఎంత దర్పముగా వుండే వాడో, అంతెజాలిగుండె గలవాడు. కోపమువస్తే ఒక్కక్షణమే వుంటుంది. అధికారములో నున్నన్నాళ్ళు ప్రజలు భయభక్తులతో ఆయన దయకు పాత్రులైనారు. వీలున్నంతవరకు అందరికి సహాయము జేస్తుండేవాడు. అందువల్ల వాసుదేవరావు గారంటే, ఆ సమీపములో అన్ని గ్రామాదులవారు, ప్రేమించే వాళ్ళు. ఆయన మొదటి నుండీ చెప్పుడుమాటలు వినే రకముగాదు.

తనకు సత్యమని, ధర్మమని తోచిన పనిని చేసి తీరేవాడు. చక్కగా చదువుకొన్న సంస్కార ప్రియుడు - కళాకౌశలత్వమున్న రసికుడు. ఇంత మంచివాడును, ధీమంతుడును అగుటచేత, ఆయన తన జీవితమును ఆనందప్రదముగను, శుభకరముగను చేయగలిగాడు.

వాసుదేవరావుగారు యితరుల కెంతమంచివాడైతేనేమి, కులమునకతడు దూరుడు - సంఘమునకతడు ప్రబల విరోధి - సనాతనుల దృష్టియందతను అంటరానివాడు.

వాసుదేవరావుగారి తండ్రి హరినారాయణగారికి నలుగురు మొగపిల్లలు ఒక ఆడపిల్ల జన్మించారు. మొగపిల్లలు నలుగురిలో మొదటి యిద్దరు అకాలమృత్యువువాత బడ్డారు. మూడోవాడు శ్రీకృష్ణమూర్తి గోదావరిజిల్లాలో పోలీసు సబ్ఇనస్పెక్టరుగా వుండి యిప్పుడు నౌకరి విరమించుకొని అక్కడనే ఉంటున్నాడు. నాలుగోవాడు వాసుదేవరావు. ఆడపిల్ల పేరు సత్యవతి. ఆమెను నెల్లూరు జిల్లాలో ఒక భూస్వామికిచ్చి వివాహము చేశారు. వాసుదేవరావు తండ్రి న్యాయవాద వృత్తిలో నుండి చక్కగా నార్జించి పేరు ప్రతిష్ఠలతో యిటీవలనే, తనువు చాలించాడు. వాసుదేవరావు తల్లి శ్రీకృష్ణమూర్తి దగ్గర వున్నది.

వాసుదేవరావు చెన్నపట్నంలో యింగ్లీషు చదువుకొంటున్న కాలమున అక్కడికి ఉద్యోగరీత్యా వచ్చిన, ఉమామహేశ్వర రావుతో పరిచయమేర్పడ్డది. ఇద్దరు ఒక శాఖకు చెందిన వారే

అగుటవల్ల, అప్పుడప్పుడు వాసుదేవరావు వారి కతిథియగు చుండేవాడు.

ఉమామహేశ్వరరావు కూతురు ఇందిర బాలవితంతువు తండ్రి యొద్దనే వుంటున్నది. పాపము ! పదేళ్ళపిల్ల - ఆ బాలికను జూచి వితంతువని యెవ రనగలరు? అంద చందాలు ఆమిరినచక్కనిచుక్క - వాసుదేవరావా పిల్ల నవలోకించి జాలిపడ్డాడు. ఒక నాడు స్వతంత్రించి ఉమామహేశ్వరరావుతో ఇందిరను గూర్చి ముచ్చటించాడు. అభమునుభము తెలియని ఆ పిల్లను బలవంత ముగా అగ్నిలో త్రోయవద్దని సలహా నిచ్చాడు. వీరేశలింగంపంతులు గారి యొక్కయు, వారి అనుచరుల యొక్కయు, దివ్యసందేశాలను వినిపించాడు. వినగా వినగా, ఉమామహేశ్వరరావుకు వాసుదేవ రావు చెప్పే సంగతు లన్నీ యధార్థమని, ఆచరణీయములని తోచింది. ఆనాటి కానాడు వాసుదేవరావు తరుచుగా వాళ్ళింటికి వస్తూ పోతూ వుండడమువల్ల ఇందిర మునుపటివలె వాసుదేవరావును జూచి, సిగ్గుపడి వెళ్ళేదిగాదు. రానురాను, ఇందిర వాసుదేవరావులు ఒక కుటుంబములోని భాగస్వాములవలె, స్వేచ్ఛగా మాటాడుకొనుటకు అలవాటు పడ్డారు. దైవముఖమున వా రిరువురు పవిత్రులు - వారి సంభాషణల కెవ రంతరాయము కలిగించగలరు ?

జాలి ప్రేమకు ప్రథమ సోపానము - ప్రేమలోనుండి త్యాగ ముద్భవించుతుంది - త్యాగాన్ని మించిన తపస్సులేదు. ఆ మాధు ర్యము-ఆనందము - అనుభవపరులగు త్యాగమూర్తులకే విదితము.

ఒకనాటి సాయంకాలము, ఉమామహేశ్వరరావు, వాసుదేవరావులు బీచికి షికారు వెళ్ళి, ఒక యిసుకదిబ్బమీద గూర్చొని, హస్యోక్తుల నాడుకొంటున్నారు. మాటల సందర్భములో ఇందిర విషయ మొచ్చింది. తగిన సంబంధముకొరకు తంటాలు పడుచున్న ఉమామహేశ్వరరావు గారికి ధైర్యము చెప్పి, ఇందిరను తాను వివాహమాడుటకు సిద్ధముగా నున్నట్లు చెప్పాడు వాసుదేవరావు. అంతకంటె కావలసిన దేమున్నది? వాసుదేవరావు ధైర్యసాహసాలకు, దొడ్డ బుద్ధికి ఉమామహేశ్వరరావు చాలా మెచ్చుకొన్నాడు.

ఒక శుభముహూర్తాన మదరాసులో, ఉమామహేశ్వరరావు గారింట ఇందిరకు వాసుదేవరావుకు సక్రమముగా వివాహము జరిగింది. చెన్నపట్నంలో నున్న మిత్రు లందరువచ్చి, పరిణయమహోత్సవములో పాల్గొని వధూవరుల నాశీర్వదించారు.

రాబోవు కష్టసుఖాలు వాసుదేవరావుకు తెలియకపోలేదు. అతను అన్నిటికి సిద్ధపడ్డాడు. ఒక అనాధను రక్షించుటే కర్తవ్యమని అతనికి తోచింది. అంతకుముందే వాసుదేవరావుకు వివాహముచేయవలెనని ప్రయత్నాలు చేస్తున్న తల్లిదండ్రులకీ వార్త మితిలేని దుఃఖకారణమైంది. అతని తండ్రి క్రోధంపట్టలేక, అతనితో సంబంధము వదలుకొన్నట్లు కఠినంగా వాసుదేవరావుకు జాబు వ్రాశాడు. వాసుదేవరావుకు ఆ సంవత్సరముతో, చదువు పూర్తి అయింది. ఏలాగో శ్రమపడి ఉమామహేశ్వరరావుగారి సహాయముతో రివిన్యూడిపార్టుమెంటులో ఉద్యోగము సంపాదించుకొని, వాసుదేవరావు ఇందిరకలిసి

వుంటున్నారు. పెళ్లి అయిన తర్వాత వాసుదేవరావు నాలుగైదేండ్ల వరకు తల్లిదండ్రులను చూడలేదు. వాళ్ళుగూడా అతనిని గూర్చి అంత శ్రద్ధవహించలేదు. ఉద్యోగధర్మా న్ననుసరించి, వాసుదేవ రావు అనేక తాలూకాలు మారవలసివచ్చింది. ఎక్కడికి పోయినా అతనిమీద సంఘము రాళ్ళు విసురుచుండేది. అతన్ని సంఘం బహిష్కరించింది. సనాతను లతని ననరాని మాటలని, అనవసరంగా జోక్యం గలిగించుకొని పరాభవించే వాళ్ళు. వాసుదేవరావు మనో నిగ్రహము, దారుఢ్యము గలవాడు. అతని యెడ అంతదారుణంగా దౌర్జన్యము చూపే ఛాందసులను అతను లెఖ్ఖపెట్టేవాడుగాడు. శాంతములో కష్టములనుయెదుర్కొని తనసహనశక్తిని ప్రకటించాడు.

మొదట మొదట అందరితోపాటు అతని బంధువులు గూడా వాసుదేవరావును త్రోసి రాజన్నారు. గాని నాలుగైదేండ్లు గడచిన పిమ్మట, అతను అగ్రజపదుడై మంచి స్థితిలో నున్నప్పుడు ఒక్కొక్కరే చుట్టాలు, స్నేహితులు, వచ్చిపోవుటకు ప్రారంభించారు. క్రమంగా యిప్పటికి బంధువులందరు వాసుదేవరావు నాహ్వానించడము, వాళ్ళు అతని యింటికి వచ్చిపోవటం జరుగుతుంది.

వాసుదేవరావు ఎంతమంచివాడో ఇందిర అంతే సుగుణవతి. ఆ పుణ్యదంపతులు పలువురు విద్యార్థులకు, నిరుపేదలకు, సహాయము చేస్తుండేవాళ్లు - వాసుదేవరావుకు పిత్రార్జితము పదివేలు వచ్చింది. స్వార్జితము కొద్దిగా వుంది. దైవానుగ్రహమువల్ల అతనికి సత్సంతానము కలిగింది. ఏలూరులో మంచి ఆవరణముగల గృహము, ఒక

చిన్నతోట, నిర్మించుకొని హాయిగా విశ్రాంతి దీసుకొంటున్నాడు. తృప్తిగలవాని కింత కన్న కావలసినదేమున్నది?

కమలాకరరావుకు పదునెనిమిదేండ్లుంటవి. చెన్నపట్నంలో బి. ఏ. చదువుచున్నాడు. సుశీలకు పన్నెండేండ్లు -మూడవ ఫారము వరకు స్కూలులో చదివించి, యిప్పుడు యింటిదగ్గర ఆంధ్రాంగ్ల భాషావిశారదుడైన ఒక పండితునిచేత, ఉభయభాషలు నేర్పిస్తున్నారు. సంగీత సాహిత్యములు రెంటియందును ఆ పిల్లకు ప్రవేశమున్నది. యింటియందు తండ్రితో అనేక విషయాలు ముచ్చటించి తర్కించుచూ ఆనందించుచుండేది. అనుభవ పరుడైన తండ్రి కూతురికి కావలసిన గ్రంథాలు, సంచికలు, వార్తాపత్రికలు తెప్పించి యిచ్చి చదివిస్తుండేవాడు. ఈ సంవత్సరము సుశీలకు పెండ్లిచేయవలెనని వాసుదేవరావు సంకల్పించాడు. ఇటీవల పండుగ సెలవులకు కమలాకరము వచ్చినప్పుడు, యీ సంగతి చెప్పగా అతను "సరే" నన్నాడు. కళ్యాణము అయిదు దినములు పంచి వేడుకలతో జరుపవలెనని, బీదవారి కన్నదానము చేయవలెనని వాసుదేవరావు అనుకొన్నాడు. సరియైన సంబంధముకొరకు విచారణలు జరుగుచున్నవి.

ఆ నాడు ఉమామహేశ్వరరావు సమాజ నిబంధనలను పాటించి—మానవ నిర్మితములగు ధర్మశాస్త్రములకు తల యొగ్గి—ఇందిరను సంఘమునకు బలి యొసంగినచో ?—

ఇప్పుడో? ఇందిరా నివాసము అసహాయుల కాశ్రయమై, పాడిపంటలతో వర్ధిల్లుచూ, కనులపండువుగా నున్నది.

ఇందిర జీవితము పునీతమై, మంగళప్రదమైనది.

# ఆ ర వ ప్ర క ర ణ ము

పరిష్కారమున కసాధ్యమైన సమస్యలు మాధవయ్య మనస్సున ప్రవేశించినవి. ఒకదాని కొకటి తోడై, అల్లుకొన్న చింతలన్నీ చిక్కుబడిపోతున్నవి. ఈ విధమైన ఆలోచన లతనిని పీల్చి పిప్పి చేస్తున్నవి. నానాటికి పిచ్చివాడై పోతున్నాడు. అతనికి సీతమ్మస్థితి తలచుకొన్నప్పుడు గుండె నీరై పోతున్నది. కన్నకూతురి జీవితము గంగపాలై పోతున్నప్పుడు యే మానవ హృదయము పగిలిపోదు? మాధవయ్యకు సీతమ్మ బొమ్మల కుంపటియైనది. ఏమి చేయుటకు తోచదు. సంఘమొక పెనుభూతమై సీతమ్మను నలిపివేయుటకు కాచుకొని యున్నది. ఈ ఘోర విపత్తునుండి, "ఆ పిల్లను రక్షించ గలవారున్నారా?" మాధవయ్యకు నిరంతరమిదే చింత. ఎందరు మానవు లీ మతమునకు బలియగుచున్నారో, ఆయన కిప్పుడర్థమైంది.- తలనొప్పి తనవరకు వచ్చినప్పుడుగాని తెలియదట - సౌకర్యముగాని శాంతంగాని లేని మతాచారాలెందుకు? ఈ కాలమున, మానవశక్తిని మతమే నిర్మూలనము చేస్తున్నదేమో ననుకొన్నాడు మాధవయ్య - క్రమంగా అతనికి జీవితమే హేయమై దుర్భరమగుచున్నది.

కుటుంబములో అంతకంతకు ఖర్చు అధికమైంది. చదువు సంగతెట్లా వున్నప్పటికి, నెలాఖరుగాక ముందే నారయ్యకు

రూపాయిలు పంపించి తీరాలి. అన్ని సర్దుకొనేవరకు ప్రతినెలా ఒకటో రెండో అప్పు అగుచున్నదేగాని యెట్టిని యేగాని ఏ నెలలోను మిగులుట లేదు. అంతకు ముందు చేసిన అప్పులు వడ్డీలకు వడ్డీలు పెరిగి, మాధవయ్యకు వున్న ఆస్తికంటె అధికమగు చున్నవి. అప్పు డప్పుడు అప్పులవాళ్ళు వచ్చి తొందర జేసి పోతున్నారు. "ఋణ బాధలన్ని తీరి యీ కష్టాలు గట్టెక్క గలవా? ఈ జీవితమున కింక సుఖమున్నదా?" అని మాధవయ్య దైవమును ప్రార్థించుకొను చుండేవాడు. ఇడుములలో చిక్కి చితికిపోతున్న మానవుని రక్షించేది ఆశ ఒక్కటే.- ఘోరదరిద్రమునబడి, చావుబ్రతుకుల మధ్య సన్న గిల్లుచున్న మానవుణ్ణి ఉద్ధరించేది ఆశ ఒక్కటే- ఆశలుడిగిన మరు లక్షణము మానవునికి ప్రాణాలుండవు. జీవులీ ఆశాపాశముల బంధింప బడి ఆడుచున్నారు.

మాధవయ్యను బాధిస్తున్న సమస్యలలో నాగమ్మ విషయ మొకటి. ఈడుకు వచ్చిన పిల్ల పెళ్ళిగాకుండా యింట్లో వున్నది. ఎవరు సహించగలరు ? నాగమ్మ వివాహం విషయంలో మాధవయ్య చేసిన ప్రయత్న మొక్కటి అక్కరకు రాలేదు. నాగమ్మ నొక బుద్ధిమంతుని చేతులో పెట్టి సంతోషించవలెనని మాధవయ్య అను కొన్నాడు. నాగమ్మ నాజూకైన తెలివితేటలు గల పిల్ల - ఆపిల్లకు తగిన అందగాడు భర్త కావలెనని మాధవయ్య కోరిక. వివాహము జరుపుట కత డెంత తీవ్రంగా ప్రయత్నించాడో అంత వెనుకబడ్డది. దరిద్రుల యింటిపిల్లకు మంచి సంబంధా లెలా వస్తయి ? ఏ విద్యా

ధికుడు లభిస్తాడు? అసలే లోలోన కుమిలిపోతున్న మాధవయ్యను, ప్రతివాళ్ళు "ఇంకా వాగమ్మ పెండ్లి చేయలేదేమండీ?" అని ప్రశ్నించి మరింత బాధ పెట్టేవాళ్ళు. సహాయము చేయుటకు ఒక్కళ్ళు రారుగాని రాళ్ళు వేయుటకు అందరు సిద్ధపడతారు. వ్రేలు బెట్టిచూపి హేళన జేయుటకు సంఘమునకు శక్తిసామర్థ్యము లున్నవి గాని, ఆపదలలో మునిగి తేలుతున్న కుటుంబాన్ని ఆదుకొని రక్షించు టకు సంఘము లేదు. ఈనాటి హిందూమత మిట్టిదేనా? అన్య మత ములకాశ్రయ మిచ్చిన మతము - అనంతకోటి జీవులను రక్షించిన మతము - సత్యస్వరూపమై, ధర్మ నిలయమై, జగద్విఖ్యాతిగాంచి, మహోన్నత దశ ననుభవించిన మతము - హిందూ మతము, నేడు కూ్రిరులగు స్వార్థపరులతో నిండి, పాపపంకిలమగు చున్నది.

అసహాయుడగు మాధవయ్యకు తోడుపడు వారీ లోకమున లేరు. అంతులేని దిగుళ్ళతో ఆయన మంచ మెక్కాడు. నాగమ్మ అప్పు డప్పుడు సమయానుకూలముగా సలహా నిస్తూ, ఉపచారాలు చేస్తున్నది. తనకు వివాహము కాలేదని మాధవయ్య విచారపడుచు న్నట్లు నాగమ్మ గ్రహించింది. "తన విషయమై విచారపడవల దనియు, దైవ నిర్ణయ మెట్లున్న నట్లు జరుగగలదనియు," నాగమ్మ అంటుండేది. సీతమ్మగూడా యిప్పు డిప్పుడు లోకవ్యవహారాలు మంచిచెడ్డలు తెలుసుకొంటున్నది. రాబోవు కష్ట సుఖాలనుగూర్చి కొంత ఆలోచన చేయసాగింది. ఇరుగుపొరు గమ్మలక్కలు తనను గూర్చి అనుకొనే మాటలు ఆలకిస్తున్నది. తన తండ్రి మంచ మెక్క

టకు కారణము తానే ననుకొన్నది. కర్తవ్యము బోధపడలేదు. తన స్థితిని తాను నిర్ణయించుకొనలేని అబల యితరుల కేమి జేస్తుంది". సీతమ్మ బ్రతు కెంత భారమైనది? ఆ పిల్ల జీవించియుండుటవల్ల యెందరు బాధపడుచున్నారు! సంఘమున కామె ప్రబల విరోధి-లోకమున కామె కంటకప్రాయము-ఆమె తల దువ్వకూడదు-పూలు ముట్టగూడదు - పరిశుభ్రమైన వస్త్రాలు ధరించగూడదు. ఇన్నెందుకు?— అసలు బ్రతుకనే గూడదేమొ?

"మాధవయ్యకు జబ్బుగా నున్నదనీ, నానాటికి కృశించి పోతున్నాడనీ, వచ్చి చూచి పోవలసినదనీ" సూరయ్యకు జాబు వ్రాశారు. నేడో, రేపో రావచ్చునని సూరయ్యకొరకు అందరు యెదురు చూస్తున్నారు. రెండు మూడు దినములు గడచినతరువాత ఒకనాడు వాసుదేవరావుగారు, ఆ దారిన వెళ్ళుతూ, మాధవయ్యకు యెలా వున్నదో నని, చూచిపోవుటకు వచ్చారు. నాగమ్మ వెంటనే వాసుదేవరావుగారి కొక కుర్చీని దెచ్చివేసింది. ఆయన కూర్చొని క్షేమ సమాచారములు తెలుసుకొనుచూ మాటల సందర్భములో "సూరయ్య సత్యాగ్రహము చేసి జైలుకు వెళ్ళినాడని, ఈ సంగతి ఆ క్రిందటి దినము వార్తా పత్రికలో తాను చూచాననీ" చెప్పాడు. ఈ వార్త మాధవయ్యకు "గోరుచుట్టుమీద రోకటిపోటు" అయింది. ఇంట్లో అందరు పెద్దగా యేడువసాగారు. కన్నకొడుకైయినా కళ్ళ యెదుట నుండకపోయెనని, మాధవయ్య, లక్ష్మమ్మ పరిపరివిధాల దుఃఖించారు. చూచిపోవుటకు వచ్చిన వాసుదేవరావు నిలువున

నీరైవాడు. ఆట్టి పరిస్థితులలో యే మానవహృదయము కరుగదు ? వాసుదేవరావుకు లేచి వెళ్ళుటకు కాళ్ళాడలేదు. ఎవరేమిచేయగలరు? దైవనిర్ణయము నెవరు అడ్డుకొనగలరు! మాధవయ్య కుటుంబము కూలిపోవుటకు సిద్ధముగా నున్నది. ఆదుకొనుటకు చెప్పదగిన బంధువు లెవరు మాధవయ్యకు లేరు. భార్య తాలూకూ ఒకరిద్దరు చుట్టాలున్నారు గాని, వాళ్ళు అంత మంచి స్థితిలో లేరు. మాధవయ్య, తలుచుకొని, తలుచుకొని, వాసుదేవరావు వంక జూచి కంటనీరు గార్చాడు. ఆచూపులు వాసుదేవరావు హృదయములో నుంచి దూసుకొని పోయినయి. ఆయన ఒక్క క్షణం నిర్విణ్ణుడైపోయినాడు. కొంతసేపటికాయన ఊహకేదో గోచరించింది – అంతరాత్మ ఒక దివ్య సందేశాన్ని ప్రకటించింది. మాధవయ్య చూచిన ఆ చూపులో యెంత అర్థమున్నదో వాసుదేవరావు గ్రహించాడు. "దీనజనరక్షా దక్షులు లేరా? తనవంటి దరిద్రులకు హిందూమతమున స్థానము లేదా?" అని ఆ చూపులు ప్రశ్నించినయి.

వాసుదేవరావును సంఘము బహిష్కరించింది గదా! ఆయనతో మాట్లాడుటే గొప్ప తప్పు. ఒకనాడు వాసుదేవరావున కిబ్బంది కలుగ జేసిన సమాజములో మాధవయ్య కూడా ఉన్నాడు. ఆయన బుద్ధిపూర్వకంగా అలా చేయలేదు. మాధవయ్య సహజంగా చాలా మంచివాడు. వీలున్నంతవరకు ఉపకారము చేసేవాడేగాని, యెవరి మనసు నొప్పించేవాడుగాదు. ఆనాటి క్రూరులగు కులపెద్దల

బలవంతమున, మాధవయ్య అలా చేయవలసివచ్చింది. తన హృదయ దౌర్బల్యమున కతడప్పుడే పరితపించాడు. అయినప్పటికి వాసుదేవ రావు యిలాంటివి పాటించేవాడు గాడు. అతడు నవనీతహృదయుడు. అపకారులకు గూడా ఉపకారము చేసే బుద్ధి వాసుదేవరావుకు ఉగ్గుబాలతో వచ్చింది. నీతికి, ధర్మమునకు అర్థము తెలియని మూఢులగు పూర్వాచార పరాయణులను జూచి ఆయన జాలి పడేవాడు. తాను అందరితోను మాట్లాడుతూ, తన మంచి తనమును ప్రకటిస్తుండేవాడు. మాధవయ్యగారిల్లు వాసుదేవ రావుగారింటికి ఒక ఫర్లాంగుదూరములో నున్నది. ఆయ నప్పు డప్పుడు మాధవయ్యగారింటికి వచ్చి పోతుండేవాడు. సీతమ్మ నాగమ్మ కూడా తీరినప్పుడు వాసుదేవరావుగారింటికి వెళ్ళి, సుశీలతో ఆడుకొనేవాళ్లు. వాసుదేవరావు మొదటినుంచి, మాధ వయ్యగారి కుటుంబముమీద అభిమానముగా వుండేవాడు.

"ఏడ్చినందువల్ల ప్రయోజన మేమున్నది, మాధవయ్యా! దిగులుపడి, మంచ మెక్కి ప్రాణాలు పోగొట్టుకొంటావా? తెలివి తేట లుపయోగించుకొని, సమర్థించుటకు ప్రయత్నించు! నీకు కావలసి నంత సహాయము జేయుటకు నేను సిద్ధముగా నున్నాను" అన్నాడు వాసుదేవరావు.

"అంతటి పుణ్యమా ?"

"సందేహము లేదు. నేను తప్పక సహాయము చేస్తాను నీ చీకు చింత లన్ని నాకు వివరంగా చెప్పు!"

"ఒకటా, రెండా? లోకంలోవున్న కష్టాలన్ని నన్నేవరించినవి."

"భయములేదు. త్వరలో అన్ని సర్దుకొనవచ్చును. ఋణబాధ మిక్కుటమైనదా ?"

"ఔను! అప్పిచ్చినవారు నీచంగా ప్రవర్తిస్తున్నారు. నాకు నిలుచుటకు నీడకూడా వుండదేమో? ఈయిల్లు రెండువేలకు తాకట్టు పెట్టిన సంగతి తమకు తెలిసినదేగదా !"

"సరే! రేపో, మాపో, ఆధనము నే నిచ్చి, బాకీలు తీర్చెదను. అటుపిమ్మట జూచుకొనవచ్చును. — అకాలమైనది, లేచి, భుజించి సుఖముగా నిద్రపో!"

"వాసుదేవరావుగారూ! మాకీ జన్మమునకు భగవంతుడు మిమ్ములను చూపినాడు. మీ ఋణమేలా తీర్చుకోగలము?..."

"అలాంటి మాటలనవద్దు - కష్టకాలములో ఒకరికొకరు తోడు పడుట మానవ ధర్మము."

"అందరు మీ వంటి ధర్మాత్ములుంటే, లోకములో కష్టాలుంటయా ? వాసుదేవరావుగారూ! సూరయ్యా నన్నుద్ధరించునని కొండంత ఆశపెట్టుకొన్నాను. నా కోరికలన్నీ గగనకుసుమాలైనయి, వాడింత పనికిరాని వాడైపోతాడని నేను కలలో గూడా అనుకోలేదు."

"అప్పుడే యెలా నిర్ణయించగలరు? అతను మంచి ఉన్నతస్థితికి రాగలడేమో? కారాగారవాసమతని జ్ఞానోదయమునకు కారణము కాగూడదా? అగ్ని దగ్ధమైన హిరణ్మయ శిలాకవలె అతడు

పునీతుడై రాగలడు. ఒక్క సంవత్సరమే శిక్ష విధించినారు. చూచు చుండగనే సంవత్సరము గడచి పోగలదుగదా? విచారించవద్దు.''

''మీవాక్చాతుర్యము కొనియాడ దగినది. మంచిని చెడ్డగాను, చెడ్డను మంచిగాను, ప్రదర్శించగల ప్రజ్ఞావంతులుమీరు. నీచమైన కారాగారము మీదృష్టిలో పవిత్రమైన విద్యాలయముగాబోలు?''

''అన్నిటిలోను మంచి చెడ్డలు కలిసే వుంటయి. ఉపయోగించు కొను వ్యక్తులను బట్టి ఫలితా ఫలితము లేర్పడును. విద్యాలయాలన్నీ చక్కగా నున్నవా? కళాశాలను వదలి వచ్చిన విద్యార్థులలో యెందరు నీచులు లేరు? అందరు యోగ్యులని మీరు చెప్పగలరా? హంతకులకు, బందిపోటు గాండ్రకు జైలు నరకతుల్యము గావచ్చును. విశాల హృదయులును, ఉన్నత మనస్కులును, ప్రజా సేవకులును అగు, సత్యాగ్రహులకది స్వర్గసమానము. ఈ విషయమును గూర్చి చెప్పవలెనన్న, చాలా కాలము పట్టును. సూరయ్యను గూర్చి మీరేమీ విచారించవద్దు.– భుజించి విశ్రాంతి దీసుకొనండి! వీలుగా వుంటే నేను మళ్ళీ వస్తాను''అని వాసుదేవరావు లేచి వెళ్ళాడు.

సీతమ్మ సమీపములో కూర్చొని, ఏకాగ్రదృష్టితో ఆలకిస్తు న్నది. వాసుదేవరావు కనుచూపు మేరదాటువరకు అందరు ఆయన వంక చూస్తున్నారు.—

# ఏడవ ప్రకరణము

"స్వరాజ్యము నా జన్మహక్కు", అను వాక్యము ప్రతిహిందువుని హృదంతరాళమునందు, మారుమ్రోగుచున్నది. ఇతర దేశీయుల వలె, మనముగూడ స్వాతంత్ర్య వాయువులను పీల్చవలెననీ, నలుగురితో పాటు మనముగూడ స్వేచ్ఛగా సంచరించవలెననీ, ప్రజ లందరికి నాయకులు బోధించారు. ఊరూర సభలు జరిపి గాంధీమహాత్ముని సందేశాన్ని జనుల కందజేస్తున్నారు. స్త్రీ పురుషు లందరిలోను ఒక వింత సంచలనము కలిగింది. ఉల్లిపొరవంటి ప్యారీసు సిల్కులుగట్టే సుకుమారు లందరు మోటైన ఖద్దరు బట్టలు కట్టుటకు అలవాటు పడ్డారు. అందరు "గాంధీకి జై! భరతమాతకు జై!" అను కేకలతో, ఉత్సాహంగా, శాసన ధిక్కారము చేస్తున్నారు—జైళ్ళకు వెళ్ళుతున్నారు - తన్నులు తింటున్నారు—ధనధనేతరముల కోల్పోతున్నారు—అష్టకష్టాలు పడుచున్నారు—స్వరాజ్యము సార్జించుటకు సర్వము త్యజించుచున్నారు. మహదానందమున కష్టముల నెదుర్కొనిన త్యాగమూర్తుల పటములను పట్టుకొని ఉత్సవములు జేయుచు, నగర సంకీర్తనములు జేయుచున్నారు. ఎండ కన్నెరుగని లలనారత్నములు, ఇల్లువాకిళ్లను వదలి జైళ్ళ కేగుచున్నారు. ఇంటింటరాట్నాలు, ఊరూర శిబిరాలు వెలిసినవి. కులగోత్రముల పాటించ

కుండా, మతభేదముల మాట మరచి, ప్రజలు ప్రవర్తిస్తున్నారు. శిబిరాలలో అన్ని కులాలవారు కలిసి కూర్చొని ఏకపంక్తిన భోజనము చేస్తున్నారు. హిందూ మహమ్మదీయుల సఖ్యతకొరకు నాయకులు తీవ్రప్రయత్నము చేస్తున్నారు. విద్యార్థులు చదువు మానేసి సత్యాగ్రహుల్లో చేరుతున్నారు. దేశములో యీ కోలాహలము మిన్ను ముట్టుచున్నది.

బెజవాడలో అన్ని వీధులలోను సభలు జరుగుచున్నయి. నాయకులు, అనుచరులు, త్రివర్ణపతాకముల నెగురవేస్తూ, ఉపన్యాసాలిస్తున్నారు. స్త్రీలు జట్లు జట్లుగా బయలుదేరి, ప్రచారము సాగిస్తున్నారు. యువకులు ద్విగుణీకృతోత్సాహముతో, నడుములు బిగించి, కార్యరంగమున దుమికి శిక్ష లనుభవిస్తున్నారు.

ఇలాంటి వాతావరణములోనున్న సూరయ్య యెలా వూరుకో గలడు. సహజంగా అతడు స్వాతంత్ర్యప్రియుడు. అతడి స్నేహితులు కొందరిది వరకే శాంతిసమరములో ప్రవేశించారు. అందువల్ల సూరయ్యకూడా దిగవలసివచ్చింది. రెండు మూడు సభల కతడగ్రాసనాధిపతియై, ఆవేశంతో ఉపన్యాసా లిచ్చాడు. వెంటనే సర్కారువారు పట్టుకొని బంధించారు. పౌరులు సూరయ్యకు పూలదండలు వేసి, గౌరవించారు. న్యాయాధికారి విచారించి, సూరయ్యకు ఒక సంవత్సరము శిక్షయిడుకు విధించాడు. సూరయ్యను రాజమండ్రి సెంట్రిలుజైలుకు ఆ రాత్రే తీసుకొని వెళ్ళారు.

సూరయ్య యెక్కడవున్నా వూరకోనే రకముగాదు. "నేను వున్నాన"నిపిస్తాడు. ఎక్కడ యే అల్లరిజరిగినా, అలజడి అయినా అతను వుండవలసినదే—వెళ్ళిన పది దినములకే, రాజమండ్రి జయిలులో ఖయిదీలకు తగిన వసతులు లేవని, కొందరు రాజకీయ ఖయిదీలు జైలు అధికారులతో కలహం పెట్టుకొన్నారు. ఆజట్టులో గుంటూరుజిల్లా నుండి వచ్చిన శర్మగారొకరు, గోదావరిజిల్లా నుండి వచ్చిన శాస్త్రి గారొకరు, సూరయ్య మరికొందరు వున్నారు. వాళ్ళందరు ఆహారము పుచ్చుకొనుట మానివేసి, నిరసనవ్రితము పట్టారు. ఒకటి రెండు దినములు గడిచినయి, మూడవనాడు జైలుడాక్టరు వచ్చి వీళ్ళందరిని జైలులో వున్న వైద్యశాలకు చేర్పించాడు. అక్కడ వీళ్ళందరు మంచి మంచి ముచ్చట్లు చెప్పుకొనుటకు ప్రారంభించారు. శర్మగారు భగవద్గీత అంతా సూరయ్యకు చక్కగా నూరిపోశాడు. శాస్త్రిగారు టాల్‌స్టాయి కథలు, టాగూరు మహాశయుని గీతాంజలి మున్నగు గ్రింథాలు చదివి, కవితాచమత్కృతిని, కళాపోషణను, విపులముగా చర్చించేవాడు. ఇవన్నీ సూరయ్య శ్రద్ధతో ఆలకించి మధ్య మధ్య ప్రశ్నలు వేసి అనుమానాలు తీర్చుకొనేవాడు. ఇలా మరి మూడు దినములు గడిచినయి. జైలులోవున్న పెద్దలు నలుగురు కలిసి. అధికారులతో చెప్పి, రాజీపరిచి, నిరసనవ్రితము మాన్పించారు.

కొన్నాళ్ళుగడించింది. జైలుఅధికారులు, సూరయ్యను, శర్మను, శాస్త్రిని, ఆ జట్టులోనున్నవారి నందరిని, రాజమండ్రి జైలునుండి

మార్చివేశారు. కొందరిని బళ్ళారి, కొందరిని అలీపూర్, కొందరిని మద్రాసు పంపించారు. సూరయ్యా బళ్ళారి సెంట్రలు జైలులో పడ్డాడు. అక్కడ అన్ని జిల్లాలనుండి వచ్చిన ఆంధ్రులు, కొందరు తమిళులు కూడా వున్నారు. వీళ్ళందరితో సూరయ్యా చక్కగా కాలక్షేపము జేస్తున్నాడు. అతనికి చక్కని గ్రంథాలు చదువుకొను టకు లభించినయి. తిలకుగారి భగవద్గీత రెండు మూడు పర్యాయములు పూర్తి జేశాడు. వివేకానంద, రామకృష్ణ పరమహంస మున్నగు మహాత్ముల జీవితచరిత్రలు, అనేక పద్యకావ్యాలు, నాటకాలు చదివాడు. జైలులో సంస్కృతము వచ్చినవారు, హిందీ వచ్చినవారు వున్నారు. వాళ్ళనాశ్రయించి, నిత్యము రెండు గంటలు కూర్చొని ఆ విద్యల నభ్యసిస్తున్నాడు. అప్పుడప్పుడు ఆచార్యులవారి ఉపన్యాసాలు వినే వాడు. ఆచార్యులవారు విద్యార్థిసులు - రాజకీయవేత్త - పేరుగన్న నాయకులలో నొకరు. వారివెంటనుండి సూరయ్యా అనేక విషయాలు నేర్చుకున్నాడు. ఈరకంగా సూరయ్యా జైలు జీవితము నిర్విచారంగా గడచిపోతున్నది. ఆరుమాసాలు జరిగినయి.

సూరయ్యకు ఇంటియొద్దనుండి రెండు మూడు జాబులు వచ్చినవి. తన్మూలకంగా అతనికి యింటి వ్యవహారాలన్నీ తెలుస్తునే వున్నయి. అతడేవీ పట్టించుకొనుటలేదు. వాటినిగూర్చి అణుమాత్రమైనా ఆలోచించేవాడుగాడు. తాను క్షేమముగనున్నట్లు తండ్రికి జాబు మాత్రము వ్రాశాడు.

ఒకనాడు సాయంకాలము సూరయ్య జైలులో తన గదిలో కూర్చొని, పద్యాలు వ్రాసుకొంటున్నాడు. కృష్ణాజిల్లానుండి వచ్చిన గోపాల మను యువకుడు వచ్చి "సూరయ్యగారూ! పద్యాలు వ్రాస్తున్నారా?" అన్నాడు.

"ఔను! కూర్చోండి! ఏమీ తోచక, యేవో వ్రాసు కొంటున్నాను.''

"నిజమే! కవిత్వములో దివ్యానందమున్నది. ఈ లోకాన్నే మరచి పోవచ్చు."

"అప్రక్కన వున్న గ్రంథము భారతమా! మీరు భారతము పలుమారు చదువు చుందురు గదూ?''

"ఔను! "తింటే గారెలు తినవలె, వింటే భారతము వినవలె" అన్నారు బుధులు."

"గారెలంత కమ్మగా వుంటుందా భారతము?''

"అంతకంటె కమ్మగా వుంటుంది. అది అనుభవైకవేద్యము. అసలు మనము చదివిన చదువంతా, చదువే గాదు. భారతము చదివి తేనే, చదువు పూర్తి అయినట్లు లెక్క. భారతము భారతీయులకు అద్దము వంటిది.''

"మన మభ్యసించిన విద్య నిరర్థక మైనదని మన మిదివరకే నిశ్చయించు కొంటిమి.''

"మనము చదివిన ఇంగ్లీషు యెందుకు పనికిరాని చెత్త – భారతీయుల నాజన్మాంతము బానిసల జేసినది. – భారతమో!

మానవజీవితమును తేజోవంతముగను, మంగళ ప్రదముగను జేయ గలదు. హిందువుల కవసరమగు, రాజకీయాధిక మతాచారములను, వ్యవహార వేషభాషలను నేర్పు గ్రంథము భారతము. ఇంతయేల? ఇహపరసాధన కనువగు విజ్ఞానమయకోశము భారతము. దీనిని మించిన గ్రంథములేదు."

"సరేగాని, మీరొక పత్రికను సాగించదలచినట్లు చెప్పారు కదూ ?''

"ఔను! కొంత ధనము నీవు సహాయము చేస్తానన్నావుగదూ? అడినమాట తప్పగూడదు సుమా !"

"నే నలాంటివాడను గాను. మనము జయిలునుండి విడుదల కాగానే పత్రిక సాగించండి. నేను తప్పకుండా సహాయము జేస్తాను. మన పత్రిక అన్నివిధాల నూతన ఫక్కీలో వుండాలి. నిష్పక్ష పాతంగా, రాజకీయ, మత, సాంఘికములను చర్చించాలి."

"అంతేగాదు, మన దేశంలో అవకాశాలులేక, అజ్ఞాతంగా పడివున్న, సంకల్పసిద్ధులగు కవీశ్వరు లెందరో వున్నారు. వారి రచనలు మనము యేరి, కోరి, ప్రచురించాలి. పాత పాటలు రోత మాటలులేని కవిత్వాన్ని మనము ఆదరించాలి. లలితకళల కగ్రస్థాన మిచ్చినా, యితర విషయాలను గూడా ప్రవేశపెట్టి, సర్వాంగసుంద రంగా నుండేటట్లు చేయాలి. మన ఆశయాల కనుగుణ్యంగావుండే టట్లు ఒక ముఖపత్రము తయారుచేయవలసినదని, రామారావుగారిని అడిగాను. వారు రెండు మూడు రోజులలో పూర్తిజేస్తామని

చెప్పారు. వారిని మీ రెరుగుదురు గదా? రాజమండ్రినుండి వచ్చి మన జయిలులోనే వున్నారు."

"ఎరుగుదును, ఆయన మంచి చిత్రి కారుడు"

"వారు చిత్రించిన ప్రతిమలు కొన్ని నాకు చూపించారు. జీవకళ ఉట్టిపడుతున్నయి. అలాంటివారికి మన దేశములో పోషణ లేదుగదా అని, చాలా విచార పడ్డాను."

వీరిలా మాట్లాడుకొనుచుండగా, వార్డరువచ్చి, సూపరెండెంటు వస్తున్నాడని చెప్పాడు. అంతటితో వారి సంభాషణ ఆగిపోయింది. గోపాలము లేచి తన గదికి వెళ్ళాడు.—

## ఎనిమిదవ ప్రకరణము

చైత్రమాసము మూడుభాగాలు గడిచింది. ఇంకా యెండలు బాగా ముదరలేదు. సాయంకాలము అయిదు గంటలు గావచ్చింది. వాసుదేవరావుగారి ఫూలతోటలో మామిడిచెట్టుక్రింద బల్లలు వేయబడి వున్నవి. ఆ బల్లలమీద సుశీల, సీతమ్మ, నాగమ్మ కూర్చొని ఉల్లాసంగా ముచ్చట్లుచెప్పుకొంటున్నారు. సమీపములో మల్లెతీగెలు

అల్లుకొని వున్నాయి. తోటనిండా అనేక రకాల పూలచెట్లు, అక్కడక్కడ అందమైన పొదరిండ్లు వున్నాయి. కమ్మని వాసనలతో మల్లెచెట్లమీదుగా చల్లని గాలి వస్తున్నది. సుశీల త్యాగరాయ కృతులను పాడుతుంటే, నాగమ్మ తలవూపుతూ వింటున్నది. సీతమ్మ అప్పుడే లేచి నిలువబడి దూరముగావున్న ఒక చెట్టువంక చూస్తున్నది. ఆ చెట్టుమీద ఒక కోకిల తీరికగా కూర్చొని హాయిగా పాడుకొంటున్నది. తీరికగా కేమున్నది ? లోకం ఎటుబోతున్నదో గూడ కోకిలకు తెలియదు. లభించిన వరకు ఆరగించుట – స్వేచ్ఛగా పాడుకొనుట – నిర్భయంగా ఆడుకొనుట – ఇంతే దానిపని. ఎంతసుందరమైన జీవితము? కోకిలను జూచి మానవులు తమ జీవితాన్ని దిద్దుకొంటే బాగుండదు? ఏ జోక్యము లేకుండా ఏ చెట్టు మీదనో కూర్చొని, పరులకానందరసమును పంచిపెట్టుచున్న కోకిలమీద అకారణంగా రాళ్ళు విసిరే మానవ జాతికి దైవ మేశిక్ష విధిస్తాడో?

సీతమ్మ అలాగే వింటూ, చూస్తూ నిలువబడ్డది. కోకిల ఉండిండి "కో! కో!" అంటున్నది. ఆ గాన మాధుర్యము గాలిలో అలలై ప్రవహిస్తున్నది. సీతమ్మ తన్మయత్వం జెందింది గాబోలు, కొంతసేపటికి తాను గూడా "కో! కో!" అనుటకు ప్రారంభించింది. సీతమ్మ కోకిల యిద్దరు ఆవిధంగా ఒకరి నొకరు కవ్వించుకొంటున్నారు. సీతమ్మ "కో! కో!" అంటూనే, అప్రియత్నంగా అడుగులు వేస్తూ, కోకిలను చూస్తూ కొంత దూరము వెళ్ళింది. నాగమ్మ సుశీల

వాళ్ళగోలలో వాళ్ళున్నారు. సుశీల అప్పుడే "మరుగేలరా!" అనే కృతి అందుకొన్నది. నాగమ్మ చిటికెలు వేస్తూ, వింటున్నది.

కమలాకరం చక్కగా అలంకరించుకొని, అప్పుడే తేనీరు పుచ్చుకొని, సాంధ్య విహారానికి బయలు దేరాడు. అతడు తోటలోకి వచ్చేవరకు సీతమ్మ కోకిలతో పాడుకొంటున్నది. కమలాకరం సీతమ్మను సమీపించాడు. ఆమె అతని రాకను గమనించలేదు. కమలాకరం సీతమ్మ దగ్గరకు పోయి, "సీతా! కోకిలపాటకు నీపాటకు భేదమేలేదు" అన్నాడు. సీతమ్మ వెనుకకు తిరిగిచూచి నివ్వెరపోయింది. ఒక క్షణం అలాగే శిలాప్రతిమవలె నిలువబడ్డది. కమలాకరం సహజకంఠంతో "సీతా! భయపడ్డావా? రా! సుశీల దగ్గరికి పోదాం" అన్నాడు. సీత తెప్పరిల్లుకొన్నది. ఆమెకు నిలువెల్ల పులకరించి, కెమ్మోవి కెంపువన్నె కదిలించె. చెక్కులమీది గులాబీలు అదిరినయి. చూపులు నేలను చూస్తున్నయి. కమలాకరం మారుమాటాడక సుశీల నాగమ్మలున్న స్థలమునకు నడుస్తూ, మధ్యమధ్య వెనుకకు తిరిగి సీతమ్మను చూస్తున్నాడు. సీతమ్మ వాలుగన్నులతో అతనిని చూచింది. ఉభయుల చూపులు ఒక విద్యుత్ శక్తిచే బంధింపబడినవి. ఒక చిరునవ్వు సీత పెదవులను కదలజేసి, కమలాకరం హృదయానికి ఒక సందేశాన్ని అందించింది. కమలాకరము సుశీల నాగమ్మలదగ్గరకి వెళ్ళాడు. నాగమ్మ లేచి, సీత యేదీ అంటూ అటుచూచింది. సీతమ్మ అప్పుడే వస్తున్నది. "ఎప్పుడు వెళ్ళావక్కడికి సీతా? కమలాకరము నీవు అనుకొంటున్నారా, పూలచెట్లలో?" అన్నది.

సీత కా మాటలు వినబడలేదు. ఆమెకూడా వచ్చి సుశీల నాగమ్మ లతో చేరింది. కమలాకరం అందరిని కూర్చోమన్నాడు. నాగమ్మ, సీత మొదట కూర్చోలేదు. సుశీల బలవంతంగా కూర్చో బెట్టింది. అందరు కలిసి లోకములోని ముచ్చట్లు చెప్పుకొంటున్నారు. సీత విధిలేక అక్కడ కూర్చొన్నది. కమలాకరమువాళ్ళకు మద్రాసులో మొన్న మొన్న జరిగిన ఒక పాటకచ్చేరీని గూర్చి చెప్పుటకు ప్రారంభించాడు.

సూర్యు డస్తమించ బోతున్నాడు. సాంధ్యరాగాలు వింత వింత రంగుల నద్దుచు గగనతలము నావరించినయి. సక్రమముగా తన విధిని తాను నిర్వర్తించి పోవుచున్న సూర్యభగవానుని అభినందించు టకు గాబోలు, తారకలు కొన్ని విను వీధిని ప్రవేశించినయి. స్త్రీ లందరు పని పాటలు ముగించుకొని, తీరికగా జడలువేసుకొంటు న్నారు. పురుషులు సాంధ్య విహారముల కేగుచున్నారు. అప్పుడే వాసుదేవరావుగారు అవసరమయిన పను లేవో పూర్తి జేసుకొని, చల్లగాలికి తోటలోనికి వచ్చారు. ఆయనను చూచి కమలాకరము వాళ్ళందరు లేచి నిలుచబడ్డారు. వాసుదేరావు వాళ్ళను కూర్చో మని, తానుగూడా ఆసీనుడగుచు, "నాగమ్మకొక చక్కని సంబంధము మాట్లాడి యేర్పాటుచేశాను" అన్నాడు. నాగమ్మ సిగ్గుపడి తలవంచుకొన్నది. సీత "ఏ వూరులోనండీ?" అన్నది.

"గుంటూరు జిల్లా బ్రాహ్మణ అగ్రహారము - పెండ్లికొడుకు బి. ఏ. ప్యాసై, ఈ యేడు వ్యాపారములోకి దిగాడు".

“ధనవంతుడా?” అన్నాడు కమలాకరము.

“అంత ధనవంతుడు గాదు. ఒక పెట్టుబడిదారుని కలుపుకొని వ్యాపారము సాగించాడు. మన దేశంలో పండిన పొగాకు కొని యితర దేశాలకు యెగుమతి చేస్తున్నారు.”

“పొగాకు వ్యాపారం మంచిదే!” అన్నాడు కమలాకరము.

“పెండ్లికొడుకు అందగాడేనా!” అన్నది సుశీల.

“ఔనమ్మా! మన కమలాకరములాగున వుంటాడు. అందగాడే నని చెప్పవచ్చు.”

ఆ మాట అనగానే సీత, కమలాకరములు, ఒకరి నొకరు చూచుకొన్నారు. సుశీల అది గమనించి నవ్వుకొన్నది.

“దీపాలు పెట్టేవేళ అయింది. ఇక మీరు యిండ్లకు పొండి” అని, వాసుదేవరావు, సుశీల, సీత, నాగమ్మలను పంపివేసి, తాను కమలాకరముతో ముచ్చటించుటకు ప్రారంభించాడు. మాధవయ్యగారి యింటి స్థితిగతులన్నీ చెప్పి, వారి ఋణములన్నీ తాను తీర్చివేసి వారికి సహాయము చేసినట్లు కమలాకరముతో చెప్పాడు.

“ఆ రొక్కమంతా, మాధవయ్య గారికి ఉచితముగా యిచ్చి వేసినట్లేనా?” అన్నాడు కమలాకరము.

“కాదు ఆ మొత్తమునకు మాధవయ్య మనకు నోటు వ్రాసి యిచ్చాడు. వారు బాగుపడి మంచి స్థితిలో నున్నప్పుడు మన బాకీ తీర్చుకొంటారు. మాధవయ్య మంచివాడు. అతనిని జూచి నప్పుడు,

నా కమిత జాలి కలిగింది. పాపము! ఇంకా బ్రతికినంత కాలము బ్రతుక వలసినవాడు, దిగుళ్ళవల్ల మంచమెక్కాడు."

"పాపము! చుట్టాలెవ్వరు లేరు కాబోలు!"

"చెప్పదగినవారెవ్వరు లేరు."

"ఋణబాధ ఒక్కటేనా వారికి? అంత అప్పు ఎందుకు చేశారో?"

"సీత పెండ్లికి కొంత – సూరయ్య చదువుకు కొంత, అప్పు జేసినట్లున్నాడు. సీత గతి అలా అయిందిగదా?—నాగమ్మకు పెళ్ళి కాలేదని ఒక దిగులు – "తన కూతురికి పెళ్ళిజేశాడుగాని, అన్న కూతురికి చేయలేదు" అని, పరులు అంటారేమోనని, లోకాపవాద మునకు మాధవయ్య చాలా భయపడుతున్నాడు. ఇంకా సూరయ్యకు కూడా పెళ్లి కాలేదు. కావలసిన కార్యాలన్నీ ముందే వున్నయి. సూరయ్య త్వరలో చేతి కక్కరకు వస్తాడని, పాపము, మాధవయ్య చాలా ఆశపడ్డాడు. అతడు వెళ్ళి, జయిలులో కూర్చొన్నాడుగదా! ఈ దిగుళ్ళు చాలవూ, మానవుణ్ణి కృంగదీయుటకు!...ఇవన్నీ ఒక యెత్తు–ఈడుకువచ్చిన ఆడపిల్ల ఇంట్లో వుండుట ఒక యెత్తు-!..."

"నిజమే నాన్నా! సీతను జూస్తే, నాగుండె కరిగిపోతుంది. లోకమంటే యేమిటో తెలియని అమాయకురాలు – ఆమె జీవితము భగ్నమై పోవలసినదేగదా? పోనీ,...సీతకు మళ్ళీ పెళ్ళి చేయగూడదూ?"

"మాధవయ్యకు నేనా విషయము అనేక పర్యాయములు చెప్పాను. చెప్పగా, చెప్పగా కొన్నాళ్ళకు మెత్తబడ్డాడు. అతని భార్య కొంత అడ్డుపడుచున్నది."

"సీత తనంతటతాను పెండ్లి చేసికొంటానని పట్టుబడితే, తల్లి దండ్రులేమి జేస్తారు? ఆపిల్ల తెలివి తేటలు గలది. తన స్థితిగతులను గూర్చి, తాను విచారించి, నిర్ణయించుకొన గలదు. మన సుశీల నాతో రెండు మూడు పర్యాయములు అన్నది కూడాను."

"ఇవన్నీ, నేను మాధవయ్యకు యిదివరకే చెప్పాను.- సరే గాని,- నాగమ్మ వివాహానికి గూడా మనము కొంత సహాయము జేయవలసి వుంటుంది. మాధవయ్య రిక్తహస్తుడు.- భారమంతా నామీద పెట్టి, కంటనీరు గార్చాడు."

"అలాంటి వారికి శక్తికొలది సహాయము చేయవలసినదే గాని, మన పరిస్థితులుగూడా కొంత ఆలోచించ వలసి వుంటుంది... మాధవయ్యగారి సాధక బాధకాలలో మనము శ్రద్ధ తీసుకొంటున్నప్పుడు, సీత పెండ్లి విషయం కూడా మనమే ఆలోచించగూడదూ?"

"ఔను! ఆమాటకూడా మాధవయ్యకు తెలియజేస్తాను.... ప్రొద్దుపోయినది, మనము గూడా యింటికి వెళ్ళగూడదు?"

ఇద్దరూ మాట్లాడుకొంటూ గృహోన్ముఖులైనారు. వాసుదేవరావు అన్ని వ్యవహారాలు, భార్యా పిల్లలతో ఆలోచించి, చేస్తుంటాడు. వాసుదేవరావు, కమలాకరములు, తండ్రికొడుకుల వలెగాక, స్నేహితులవలె మాట్లాడు కొంటుంటారు.

కమలాకరరావు బి. ఏ. ప్యాసై, మెడిసన్ చదువుచూ, మొన్ననే సెలవులకు యింటి కొచ్చాడు. ఈ యేడాది కాగానే, అతను బెజవాడలో ప్రాక్టీసు పెట్టవలెనని అనుకొంటున్నాడు. కమలాకర రావుకు, సుశీలకు, త్వరలో వివాహాలు చేయవలెనని, తండ్రి అనుకొంటున్నాడు. ఒకటి రెండు సంబంధాలు వస్తున్నయిగాని, యింకా యేదీ నిర్ణయించుకోలేదు. కమలాకరరావు సంస్కరణాభిలాషి – చిన్నపిల్లను పెళ్ళిచేసుకొనుట కత డిష్టపడడు. అతని వివాహము విషయములో వాసుదేవరావు, సర్వాధికారము అతనికే ఇచ్చాడు. కమలాకరరావు యోగ్యుడు – బాధ్యత నెరిగి ప్రవర్తించువాడు. అందువల్ల, వాసుదేవరావు గారికి అతనిమీద నమ్మకము మెండు.—

## తొమ్మిదవ ప్రకరణము

మంపేటలో రామయ్య మంచి పలుకుబడిగలవాడు. వాళ్ళ కుటుంబము రెండు మూడు తరాల నుండి, మర్యాదమన్ననలతో వస్తున్నది. తాత తండ్రులిచ్చిన ఆస్తిని కాపాడుతూ, స్వయముగా వ్యవసాయము జేయించి, తన హయాంలో మరికొంత పొలముగూడా

రామయ్య సంపాదించాడు. సంస్కృతాంధ్రములు చక్కగా చదువుకొన్నాడు. అన్ని వ్యవహారములు స్వయముగా చూచుకొనే తెలివితేటలున్నాయి. తనకు నచ్చిన పని జేస్తాడుగాని యితరులమాటలు వినడు. తనమాట సాగవలెననే పట్టుదలకూడా మొదటి మంచీ వున్నది. నోరుగలవాడగుటచేత రామయ్యకు అందరు భయపడతారు. నవనాగరికపు వేషాలు ఆయనకు గిట్టవుగాని, పరమఛాందసులవలె, పూర్వాచారాలనే పట్టుకొని, పెనుగులాడే మూర్ఖుడుగాదు. మనిషి యెఱ్ఱగా, పొడుగ్గా వుండి, గంభీరంగా వుంటాడు.

గోవిందరావు గతించిన తరువాత కొన్ని మాసాలవరకు రామయ్య బయటకే రాలేదు. ఎవ్వరితోను మాట్లాడేవాడు గాదు. ఎప్పుడు ఏకాంతముగా ఏదో ఆలోచిస్తుండేవాడు. అందాశ్చర్యమే మున్నది! ఉన్న ఒక్క కొడుకు మరణించినప్పుడు యే తండ్రి గుండె నిబ్బరముగా వుంటుంది? రామయ్య జీవితమే వ్యర్థమైపోయింది. శక్తి సామర్థ్యాలు, ధన ధాన్యాలు, యెవరుజూచి సంతోషించను? తన వంశము తనతోనే అంతరించునుగదా అనుకొన్నాడు రామయ్య.

కాలచక్రము శరవేగాన్ని మించుతున్నది. మాసములు దాటి సంవత్సరాలు వస్తున్నాయి. ఇప్పుడిప్పుడే రామయ్య ఒక రకంగా లేచి, తిరుగు తున్నాడు. నలుగురైదుగురు మిత్రులు "ఎవరినైనా దత్తు తెచ్చుకొని వంశము నిలువబెట్టరాదా!" అని రామయ్యకు సలహా నిచ్చారు. ఆయన కాసమ్మతి నచ్చలేదు.

"తన అక్క కూతురొకపిల్ల వున్నదనీ, ఆ పిల్లను తెచ్చి పెంచుకొనవచ్చుననీ'', భార్య రెండు మూడు పర్యాయములు రామయ్యతో అన్నది. ఆయన అందుకూ యిష్టపడలేదు. ఇలాంటి పనులన్నీ తెలివి తక్కువ వాళ్ళు చేసే పనులనీ, ఆస్తికొరకు ఆశపడి వచ్చిన వారికి, సహజమైన ప్రేమానురాగము లుండవనీ, ఆయన నమ్మకము. దత్తు తెచ్చుకొని ఆస్తిని దుర్వినియోగము చేయుటకంటె, అర్హతను గమనించి, దానము చేయుట మేలనుకొన్నాడు.

కాలమెన్ని మార్పులను గలుగ జేస్తున్నదో రామయ్య చూస్తున్నాడు. తన బాల్యములో నున్న ఆచారవ్యవహారాలకూ యిప్పటికీ పోల్చి చూస్తే, సర్వమూ తారుమారై పోయింది. చిన్న చిన్న పల్లెటూళ్ళలో గూడా, పాశ్చాత్య నాగరికత ప్రబలమైనది. యువతీయువకులలో వినయవిధేయతలు, కట్టుబాట్లు సన్నగిల్లినయి. తల్లిదండ్రులను, పోషణకర్తలను గూడా లెక్కచేయకుండా, ధిక్కరించి, తమ యిష్టాను సారము వర్తిస్తున్నారు. రజస్వలానంతర వివాహాలు, స్త్రీ పునర్వివాహాలు నిత్యము యెన్నో జరుగుచున్నయి. అన్ని విషయాలలోను మార్పుగోచరిస్తున్నది. ఎంతమంది అడ్డుపడ్డా ఆగదు. ప్రవాహానికి యెవరు యెదురీద గలరు? అసలు చలనశక్తిగల ప్రతి వస్తువు మారుతూనే వుంటుందిగాని, యెప్పుడు ఒకటే రకంగా వుండదు. అలా మారకపోతే, అది కొండరాతితో సమానమే. ఈ కాలంలోనే గాదు, యే కాలములోనయినా, ఆ కాలానికి దగిన మార్పులు చేసుకో

కుండా. వున్న మనుష్యులుగాని, దేశంగాని వున్నదేమో చెప్పగల వారున్నారా ? మార్పును జూచి, భయపడి, వెనుకకు పరుగెత్తే నిర్జీవప్రతిమలు కొందరువుండకపోరుగాని, స్వల్పసంఖ్యాకులు వ్యసన పడుచున్నారని కాలచక్రి మాగిపోతున్నదా? రామయ్య నిత్యము యిలాంటి శశ్నౌ x మ ని స్తు నే వున్నాడు. తాను మాత్రము "ఔనని,—కాదని" అనకుండా మధ్యస్థంగా వుంటున్నాడు. అలా యెన్నాళ్ళు సాగుతుంది? తన ప్రయత్నము లేకుండానే, విప రీతమైన పరిస్థితు లేర్పడినప్పుడు మానవు డేమి చేయగలడు ?

ఒకనాటి మధ్యాహ్నము భోజనానంతరము రామయ్య ఉయ్యాల బల్లమీద పడుకొని, తన ఆస్తిని గూర్చి ఆలోచించు కొంటున్నాడు. రామయ్యకు వయసు ముదురు తున్నది. తాను చక్కగా తిరుగుచున్నప్పుడే, చేయదలచిన పనులన్ని పూర్తిగావించ వలెననుకొన్నాడు. రామయ్యఆస్తి అంతా యిప్పుడే లెక్కవ గాకుండా వుంటుంది. అందులో కొంత బెజవాడలో యువతీ విద్యాలయాని కిచ్చుటకున్ను, కొంత ధనముతో చచ్చిపోయిన తన కొడుకుపేరున ఒక సత్రము కట్టించుటకున్ను, మరి కొంతధనముతో విద్యార్థుల వసతి గృహము నిర్మించుటకున్ను, నిశ్చయించుకొన్నాడు. ఇలా ఆలోచించు కొనుచుండగా తలవని తలంపుగా, తన కోడలు సీతమ్మ జ్ఞాపకము వచ్చింది. ఆ పిల్లను ఇటీవల తాను మళ్ళీ చూడ లేదు. సీతమ్మకు కొంత ఆస్తి యిద్దామా అని అనుకొన్నాడు. ఆ పిల్లకు ఆస్తి యెందుకు అనుకొన్నాడు మళ్ళీ - సీతమ్మ యిప్పుడు

బాగా యెదిగి పెద్దదై వుంటుందిగదా, అవయవముల పొందికయిలా వుంటుందికదా, ముక్కు, కన్ను, తీరు యిలా వుంటుంది గదా, అని రామయ్య తనలోతాను ఊహించుకొన్నాడు. "పడుచుదనము పాపిష్టిది.-అనాలోచితంగా యెలాంటి పనులనైనా చేయిస్తుంది.- ఒకవేళ అపిల్ల యౌవనోద్రేకములో కన్నుగానక, చేయరానిపనులు జేస్తే...?... దుర్భరము! నేను నలుగురిలో తల యెత్తగలనా? నా వంశమున కెంత కళంకము?...మా వంశము పవిత్రమైనది. మా తాత తండ్రులు చాలా గౌరవంగా బ్రతికారు. తుదకు నాజీవితమున యిలాంటి నీచాలు జరుగుతయా? ఈపరాధ వానికి నేను గురిగావలసి వుంటుదా?... లేక ఒక వేళ సీత యెవరినయినా, మళ్ళీ పెళ్ళి చేసు కొంటుందేమో ? ... అదిమాత్రము సహించ దగినదా ?...అబ్బ! స్త్రీలమూలమున పురుషుల కెంతటి విపత్తులు వస్తుంటయి? ఇప్పుడు నే నేమి చేయగలను? ..." అని యేమేమో అనుకొంటున్నాడు. ఆయన ఆలోచనలకు హద్దులేదు. తర్క వితర్కములలో మునిగి తేలుచున్న ఆయనకు అప్రియత్నముగా నిద్రవచ్చింది.

# పదియవ ప్రకరణము

కామేశ్వరరావు బి. ఏ. ప్యాసైనాడు. అతని స్నేహితులలో ధనవంతు నొకని కలుపుకొని, పొగాకు వ్యాపారము భారీగా చేస్తున్నాడు. వాసుదేవరావు డిప్యూటీ కలెక్టరు చేస్తున్న కాలములో, కామేశ్వరరావు తండ్రి భాస్కరరావు రివిన్యూ యినస్పెక్టరు చేస్తుండేవాడు. ఇప్పుడు భాస్కరరావుకూడా నౌకరి చాలించుకొన్నాడు. ఆయనకు కామేశ్వరరావుగాక మరి యిద్దరు ఆడపిల్లలున్నారు. యిద్దరు ఆడపిల్లలకు పెండ్లిచేసి అత్తవారింటికి పంపాడు. ఒక నాడు కాకతాళీన్యాయంగా బెజవాడలో వాసుదేవరావు భాస్కరరావును కలుసుకొన్నప్పుడు భాస్కరరావు తన స్థితిగతులన్ని ఆయనకు చెప్పుకొన్నాడు. అప్పుడు వాసుదేవరావు శ్రద్ధగా విచారించి, కామేశ్వరరావుకు నాగమ్మను యిప్పిస్తానని, భాస్కరరావుతో చెప్పాడు. అతను సమ్మతించి, సెలవుపుచ్చుకొని, తన పని మీద వెళ్ళాడు. వాసుదేవరావుగారు యింటికి వచ్చి యీ విషయము మాధవయ్య చెవిని వేయగనే మాధవయ్య సంతోషించి 'సరే' నన్నాడు. వెంటనే బ్రాహ్మణుని రాపించి, ముహూర్తములు పెట్టించారు. వాసుదేవరావు అన్నివిధాల మాధవయ్యకు తోడు

నీడగా ఆదుకొంటున్నాడు. నాగమ్మ వివాహానికికూడా కొంత ధన సహాయము చేయదలిచాడు. పెండ్లిపనులు చురుకుగా జరుగుచున్నయి.

మాధవయ్య జబ్బుస్థితిలో నున్నాడుగదా! ఆనాటి కానాడు, మరింత దుర్బలుడై పోతున్నాడు గాని, పురి పోసుకొనుటలేదు. మాధవయ్య బ్రతికివుండగానే నాగమ్మ వివాహము జరుగవలెనని వాసుదేవరావుగారు పట్టుపట్టారు. సూరయ్యకూడా, నేడో, రేపో, జైలునుండి విడుదలై రాగలడని అనుకొంటున్నారు. దైవనిర్ణయ మెట్లున్నదో యెవరు చెప్పగలరు?

శుక్రవారము పగలు 11 గంటలకు సరిగా లగ్నము, ఆనాటి ఉదయమే పెళ్ళికొడుకు బంధుమిత్రులతో తరలివచ్చాడు. సర్వము సిద్ధముగా నున్నది. వాసుదేవరావుగారు వచ్చి, నిలువబడి పెత్తనము జేస్తున్నారు. ముహూర్తబలము గొప్పది. సమయమునకు సరిగా, సక్రమంగా వివాహము జరిగినది. మేళతాళాలతో, అన్ని వేడుకలు, లాంఛనాలు, చక్కగా జరిగినయి. ఆ పూట వాసుదేవరావు గారిని సకుటుంబముగా వచ్చి, తన యింట్లో భుజించవలసినదని, మాధవయ్య బ్రతిమాలుకొన్నాడు. ఆయ నందుల క్లిష్టపడక, అది సమయము గాదనియు, మరియొక పర్యాయము చూచుకొనవచ్చు ననియు, సమాధానము చెప్పి సద్దుకొన్నాడు. పెళ్ళి వారందరు భోజనాలకు కూర్చొన్నారు. హరినామ సంకీర్తనములతో ఆరగింపులు జరుగుచుండగా, జయిలునుండి విడుదలై, అప్పుడే సూరయ్య యింటికి వచ్చాడు. అందరు సంతోషాతిరేకమున అతనిని చుట్టు

కొన్నారు. ఎంగిలిచేత్తో వచ్చి సీతమ్మ అన్నను కౌగలించు కొన్నది. నాగమ్మ సీతమ్మను నెట్టుచూ, అతని రెండుచేతులు పట్టుకొని, మొఖమువంక చూస్తూ నిలువబడ్డది. ఇద్దరు ఒకరి నొకరు చూచుకొన్నారు. క్షేమ సమాచారాలు చూపులతోనే చెప్పుకొన్నారు. నాగమ్మ కంట జల జల నీళ్ళు కారినయి. సూరయ్యా తుడిచి, నాగమ్మను బుజ్జగించాడు. గాఢమైన అనురాగాతిశయములను ప్రకటించుటకు భాష చాలదు గాబోలు. ఆ పవిత్ర హృదయాలు రెండు అంతరంగికంగా సందేశాలు అందుకొన్నయి. ఒకరి భావము నొకరు గ్రహించుకొన్నారు. ఇంతలో లక్ష్మమ్మ వచ్చి సూరయ్యా తల నిమురుతూ, నిలువబడి, యెన్నెన్నో ప్రశ్నలు వేస్తున్నది. లేవ లేక మంచములో పడివున్న మాధవయ్యా సూరయ్యాను తనయొద్దకు తీసుకొని రమ్మనమని కేకలు వేస్తున్నాడు. సూరయ్యా అందరికి అన్ని సమాధానాలు చెపుతూ, మెల్లగా దారిజేసుకొని మాధవయ్యాను సమీపించాడు. తండ్రిని జూచి సూరయ్యా దుఃఖ మాపుకొనలేక పోయినాడు. తండ్రి కాళ్ళమీద బడి, పెద్దగా ఏడువసాగాడు. కొంతసేపటికి సీతమ్మ ఓదార్చి, లేవదీసి కూర్చోబెట్టింది.

పెండ్లి వారందరు భోజనాదికములను ముగించుకొని లేచారు. ఆసాయంకాలము జరుగవలసిన వేడుకలన్నిజరిగాయి. నాగమ్మ వివాహము అనుకొన్న దానికంటె మిన్నగ ఆనందముతో జరిగినది. మరుసటుదయాన పెళ్ళివారిని సాగనంప వలెను. "నాగమ్మ వెంట వెళ్ళుటకు యెవ్వరులేరే" అని ఒకరి కొకరు ఆలోచించుకొనుచున్నారు.

కొన ప్రాణాలతో నున్న మాధవయ్యను చూచుచుండుటకు లక్ష్మమ్మ యింటివద్ద వుండవలసి వచ్చినది. ఇంకెవరున్నారు? నాగమ్మ తన వెంట సీతమ్మను పంపమని కోరుకొన్నది. ఈ మాట ఆనోటా ఆనోట బడి, పెండ్లికి వచ్చిన పెద్దలకు తెలిసింది. వారిలో యెవరో "సీతమ్మ వితంతువు-పనికిరాద"న్నారట - ఈ మాట మెల్లగా జారివచ్చి, సూరయ్యకు, మాధవయ్యకు, వాసుదేవరావుకు, క్రమంగా సీతమ్మకు తెలిసింది. కఠోరమైన ఆమాట విని అందరు విచార పడ్డారు. సీతమ్మ లోలోన కుమిలి పోతున్నది. ఆమెకు నోటమాట రాలేదు. కూర్చొన్నది కూర్చొన్నట్లే యున్నది. ఆమెలో ఒక తుపాను బయలు దేరింది.

"నలుగురిలో తల యెత్తుకొని తిరుగుటకు నాకర్హతలేదా? అంత తప్పు జేశానా?... ఎందుకీ జీవితము? అయినవారు, కానివారు హీనముగా చూస్తున్నప్పుడు-నాబ్రతుకే వారికి కష్టతరమైనప్పుడు-జీవించుటెందుకు?... నేనెవ్వరి కంట పడగూడదట - ఆహా! ఎంతటి కఠిన శాసనము! ఈ అనంతకోటి ప్రాణాలలో నీచాతినీచమైనదానిని నేనా? ఇంతకు నేనాచరించిన ఘోరపాపమేమున్నది? ఈలోకంలో నావంటి దీనులను రక్షించువారు లేరా? కరుణా సముద్రుడగు దేవుడున్నాడా? - లేరు - లేరు - ఎవ్వరు లేరు. లోకమంతా మాయ - అబద్ధం - క్రూరము - బాధాకరం - నీచం - ఈ లోకంలో హృదయములేని రాతి బొమ్మలు మనుష్యులని పేరు పెట్టుకొని తిరుగుతున్నారు", అని యేమేమో అనుకొంటున్నది.

ఇంతలో వాసుదేవరావు అలా వెళ్ళుచూ, సీతమ్మను చూచాడు. ఆమె మసిపాతను గట్టిన మాణిక్యము వలెనున్నది. ఆమె హృదయా వేదనను వాసుదేవరావు అర్థము జేసుకొన్నాడు. "ఆనాడు అశోకవనంలో ఏకాంతముగా వున్న సీతమ్మ యింత దుఃఖించిందా?" అనుకొన్నాడు. వాసుదేవరావు "సీతమ్మా! లేచిరా! లోకంలో దయార్ద్రి హృదయులున్నారు, చింతింపకు" అని అంటూ ఆ పిల్లను లోపలికి తీసుకొని వెళ్ళాడు.

మరుక్షణములో ఈమాట పెండ్లికొడుకు చెవిని బడ్డది. కామేశ్వరరావు సరసమైన సంస్కార ప్రియుడు. అతడికీమాట కర్ణ కఠోరంగా వున్నది. తనవాళ్ళు ఈలాంటిమాట అన్నందుకు అతడు "తనను క్షమించమని" సీతమ్మను ప్రార్థించ దలచుకొన్నాడు. తన పెండ్లికి తినిపోవచ్చిన ఛాందసులెవరో ఈ మాట అని వుంటారని అనుకొన్నాడు. వెంటనే అతను లేచి వెళ్ళి వాసుదేవరావును కలుసుకొని "అయ్యా! బాధ్యత తెలియని అసంబంధీకు లెవరో ఆమాట అన్నారట - క్షమించండి. పెండ్లికూతురు వెంట తప్పకుండా సీతమ్మను పంపండి" అని అన్నాడు.

"కామేశ్వరరావూ! దూరాలోచన లేని పసివాడవు, శుభ కార్యాలలో అల్లరి జరుగ కూడదు. కాబట్టి సీతమ్మను పంపమని స్వతంత్రించి అడుగ వద్దు. మే మేదో ఏర్పాటుజేసి యెవరినో పంపిస్తాముగదా! నీకెందుకు, నీవు వెళ్ళు!"

"నా వివాహ విషయములో నాకు అన్ని హక్కులు వున్నయి. నేను దీర్ఘంగా ఆలోచించే చెబుతున్నాను. ఇష్టములేని వాళ్ళు వెళ్ళిపోతారా, పోనీయండి! అంతమాత్రాన వచ్చే లోపమేమీలేదు. మీరు సీతమ్మను పంపితీరాలి. లేకపోతే నేను వెళ్ళను."

"మీ తండ్రిగారితో వెళ్ళి మాట్లాడు. ఆయన యిష్టానుసారము చెయ్యవచ్చును."

"వారితో యిదివరకే మాట్లాడాను. వారి కిలాంటి అభ్యంతరాలేవీ లేవు."

"అయితే సరే! అలాగే యేర్పాటు చేయిస్తాను" అని చెప్పి వాసుదేవరావు వెళ్ళాడు.

వాసుదేవరావు వెళ్ళి యీ విషయాలన్నీ మాధవయ్యకు సూరయ్యకు చెప్పాడు. వాళ్ళు చాలా సంతోషించారు. సూరయ్య సీతమ్మను బయలుదేరమన్నాడు. సీతమ్మ వెళ్ళనన్నది. ఆమెకు కోపము వచ్చింది. "అనవసరంగా తర్క-వితర్కాలతో నన్ను పది మంది నోళ్ళలో పడనీయవద్దు. ఒకరు ఔనని, ఒకరు కాదని, వాద ప్రతివాదలతో, బజారున కెక్కించు నంతటి సిగ్గుమాలిన బ్రతుకెందుకు నాది. అయాచితంగా నా పరిసక్తి లోకుల కెందుకు? నన్ను పలుకరించగూడదు - నన్ను తలుచుకో వద్దు - నా బ్రతుకు నన్ను బ్రతుకనీయండి-"అని సీతమ్మ పెద్దగా కోపముతో అన్నది. రోషాకులచిత్త యగు నామె మో మెఱ్ఱబారి, ముక్కుపుటము లదిరినయి. మోవిపై

కంపువన్న చిటెలినట్లు కదిలింది. ఆమె కన్నాబ్బకాగానే అక్కడ నున్న వాళ్ళందరు గడగడలాడి పోయినారు. సూరయ్యకు యేమీ తోచలేదు. తాను సీతమ్మను శాంతింప జేయలేక పోయినాడు. ఇంతలో వాసుదేవరావు వచ్చి, "సీతమ్మా! బుద్ధిలేనివారి మాటలను పాటింపవచ్చునా? నామాట విని లేచిరా!" అన్నాడు.

ఆమె లేచి వెళ్ళింది.

తుట్టతుదకు నాగమ్మ వెంట సీతమ్మ వెళ్ళునట్లు యేర్పాటు జేసి, పెళ్ళివారిని సాగనంపారు.

సూరయ్య మాధవయ్యతో అన్ని వ్యవహారాలు మాట్లాడాడు. కుటుంబపు చిక్కులన్నీ సూరయ్యకు అర్థమైనయి. వాసుదేవరావు తన కుటుంబమునకు జేసిన మహోపకారము యెన్ని జన్మాలకు కూడా తీర్చలేనిదనీ, భగవంతుడే ఆరూపమున వచ్చి సహాయము చేసి యుండుననీ, అతడనుకొన్నాడు.

సూరయ్య జైలునుండి విడదలకాగానే పత్రికను ప్రారంభించ దలిచాడు. అందుల కవసరమైన యేర్పాట్లు అన్నీ చేసుకొన్నాడు. అతని కెన్నెన్నో ఊహాలున్నాయి. పట్టుదలతో ఆపన్ని సాగించ దలిచాడు. ఈ పనులన్నీ జరిపించుటకు తాను వెంటనే వెళ్ళిపో దలిచాడు. గాని, తండ్రిస్థితి అపాయకరముగా నున్నది. మాధవయ్యను ఆస్థితిలో వదలిపెట్టి వెళ్ళకూడదుగదా! అతని కేటూతోచలేదు. కొంత సేపు తనలో తానే తీవ్రంగా ఆలోచించాడు. తన పనులు చాలా ముఖ్యమైనవన్నీ అత్యవసరమైనవన్నీ అని అతనికి తోచింది. మరుస

టుదయాన బయలుదేరి వెళ్ళవలెనని నిశ్చయించుకొన్నాడు. ఆ రాత్రి మూటా ముల్లె, సర్దుకొని, తల్లిదండ్రులతో మాట్లాడి వారిని సమ్మతింప జేశాడు. వాసుదేవరావుగారితో గూడా చెప్పి, వారియొద్ద సెలవు పుచ్చుకొనవలెనని వాళ్ళింటికి వెళ్ళాడు. వాసుదేవరావు తన యింటికి వచ్చిన సూరయ్యను ఆదరించి, కూర్చొబెట్టి అనేక సంగతులు చెప్పాడు. సూరయ్య చెప్పిన ముచ్చట్లన్నీ శ్రద్ధగా విని, సంతోషించి, అతని భావిజీవితమున కొక ప్రణాళికను తయారుజేసి చెప్పాడు. అతని కెప్పుడే సహాయము కావలసివచ్చినా, తాను చేయుటకు సిద్ధముగా నున్నట్లు, సూరయ్యకు చెప్పి, ధైర్య మిచ్చాడు. సూరయ్య కృతజ్ఞతాపూర్వకంగా తల వంచాడు. వాసుదేవరావుగారు ఆశీర్వదించి, సూరయ్యను ఇంటికి పంపారు. సూరయ్య యింటికి వచ్చేవరకు, లక్ష్మమ్మ మాధవయ్య మంచమువద్ద కూర్చొని కంటసిరుగా యేడుస్తున్నది. సూరయ్య రాగానే "నాయనా! తండ్రిగారి నిమిషనిమిషమునకు మారుచున్నది. చూడు! ఏవో పిచ్చి మాటలు కూడా మాట్లాడుచున్నారు" అని అన్నది. సూరయ్య గుండెలలో రాయి బడ్డది. అతడు మాధవయ్యను సమీపించి పలుకరించాడు. మాధవయ్య మాట్లాడలేక ఆయాసపడుచున్నాడు. ఒక గంటక్రిందటికంటె ఇప్పుడు రొప్పు యెక్కువైంది. "వాసుదేవరావుగారిని పిలవండి" అని మాధవయ్య మెల్లగా అన్నాడు. సూరయ్య వెంటనే వెళ్ళి వాసుదేవ రావుగారిని తీసుకొని వచ్చాడు. వాసుదేవరావునుజూచి మాధవయ్య

పెద్దగా యేడ్చాడు. "నేనిక జీవింపను, సీతమ్మను సూరయ్యను మీకు అప్పగించుచున్నాను. నా కుటుంబమును నిలువబెట్టండి" అని వాసుదేవరావును ప్రార్థించాడు. మాధవయ్యకు మాట్లాడుచుండగానే కళ్ళు మూతలు బడ్డయి. శరీరము చల్లబడ్డట్లు కనిపించింది. అప్పుడే డాక్టరుకొరకు వాసుదేవరావుగారు మనిషిని బంపారు. ఒక్కక్షణము జరిగింది. డాక్టరు యింకా రాలేదు. మాధవయ్య ప్రాణాలు విడిచాడు. ఇల్లు ఏడుపులతో ప్రతిధ్వనించి పోయింది.

సూరయ్య ఆ రాత్రి శవజాగరము జేశాడు. తెల్లవారు నప్పటికి రావలసిన నలుగురు వచ్చారు. దహన సంస్కారము జరిగినది. మాధవయ్యకు కర్మాంతరాలు చక్కగా జరుపవలసినదని వాసుదేవరావుగారు చెప్పారు. సూరయ్య శ్రద్ధగా తండ్రి అంత్య క్రియలు జరిపాడు.

దినములు గడిచినయి. ఇరవై రోజులు అక్కడే వుండి, సూరయ్య కావలసిన అన్ని యేర్పాట్లుచేసి, తన పనిమీద తాను బయలుదేరి వెళ్ళాడు.

# పదనొకండవ ప్రకరణము

మాధవయ్యా మరణించి నప్పటినుండి, గ్రామములో కలవరం బయలుదేరింది. సీతమ్మను కమలాకరం పెండ్లి జేసుకొంటాడని, మాధవయ్యా కుటుంబముకూడా బ్రహ్మసమాజములో కలిసిపోయిందని సనాతనులు తీవ్రంగా ప్రచారము సాగించారు. వాసుదేవరావు తన తెలివి తేటలతో, మాధవయ్యాను ఆయన కుటుంబము వారిని మాయజేసి తన కులములో చేర్చుకొన్నాడనీ, సూరయ్యాకు గూడా వితంతు వివాహమే జేస్తారని, గ్రామములో ఒకరి కొకరు చెప్పుకొంటున్నారు. ఈ వార్తలన్ని యెప్పటి కప్పుడు వాసుదేవరావుకు తెలుస్తునే వున్నవి. ఆయన యిలాంటి వాటిని లెక్కజేసే రకముగాదు. ఇలాంటి వెన్నో ఆయన యింతకు ముందే అనుభవించాడు. నీతిలేని, స్వార్థపరులగు సనాతనుల బెదిరింపుల కతడందడు. ఆయన ప్రవర్తన మతి గంభీరమైనది.

కమలాకరరావు సెలవులు కాగానే మద్రాసు వెళ్ళాడు. ఎప్పటివలె సీతమ్మ, నాగమ్మ వాసుదేవరావు గారింటికివచ్చి సుశీలతో ఆడుకొంటున్నారు. నాగమ్మను ఇంకా' కాపురమునకు పంపలేదు. నాగమ్మను తీసుకొని వెళ్ళుటకు భర్త వేగిర పడుతున్నాడు.

సుశీలకు వివాహము చేయవలెనని తల్లిదండ్రులు తొందరపడు చున్నారు. అనేక సంబంధాలు వస్తున్నయి. సనాతనుల దౌర్జన్యమువల్ల కొంత మంది వచ్చి తిరిగిపోతున్నారు. ఒకనాడు గోదావరిజిల్లా నుండి ఇద్దరు పెద్ద మనుష్యులు రైలుదిగి గ్రామములోకి వచ్చి "వాసుదేవ రావుగారి ఇల్లెక్కడండీ?" అని యెవరినో అడిగారు. ఇంతలో వలుగురు ధూర్వాచారపరాయణులు ఆ వచ్చిన పెద్దమనుష్యులను చుట్టుకొన్నారు. అందులో ఒకరు "తమ దే యూరండీ?" అన్నాడు.

"మాది గోదావరిజిల్లా - వాసుదేవరావు గారి ఇల్లెక్కడో చూపగలరా?"

"అలాగే! —వారి యిల్లు యిక్కడే వుంది. చూపిస్తాముగాని, వారు మీకు బంధువులా?"

"కాదు, వారితో మాట్లాడవలసియున్నది"

"ఏ సందర్భము?"

"అవన్ని తమకు అనవసరము. మీకు తెలిసివుంటే దయచేసి, వారి యిల్లు చూపండి!"

"అంత అగ్రిహమైతే యెలాగండీ? మీరు సంబంధాలకొరకు వచ్చారేమోనని అడిగాము. తప్పే మున్నది?"

"ఔను, వారి పిల్లను చూడవలెనని వచ్చాము".

"అలా చెప్పండి! ఆపిల్ల బాగానే వుంటుంది, గాని..."

"ఏమి? అనుమానిస్తున్నారే?"

"వారిసంగతి తమకు తెలియదు గాబోలు!"

"......?"

"వాళ్ళు కులములో లేరు - వాళ్ళది బ్రహ్మసమాజము"

"ఇదా! సరే! ఆవిషయము మాకు తెలుసును లెండి! బ్రహ్మ సమాజముగాదు - వాళ్ళు హిందువులే! స్వచ్ఛమైన బ్రాహ్మణులు"

"స్వచ్ఛమైన బ్రాహ్మణులుగా! ఆఁ! మీరు గూడా అరకమేనా యేమి, మంచివాళ్ళనుకొన్నాము..."

"శాస్త్రీగారూ! తమదే మతమండీ!"

"ఎందుకులే అవన్ని యిప్పుడు - మీకు కులగోత్రా లున్నయనుకొన్నాముగాని...."

"ఔనండి! మాకు కులగోత్రాలున్నయి, మీరు భ్రమపడు చున్నారు..."

"బ్రహ్మసమాజమునకు కులగోత్రాలేమిటి?"

"ఎవరిది బ్రహ్మసమాజము! — పవిత్రమైన హిందూమతము, దుర్మార్గులగు సనాతన ఛాందసులవల్ల, చీలికలై, నానాటికి క్షీణించి పోతున్నది. బ్రహ్మసమాజ మెక్కడి నుండి వచ్చినదో తెలియునా? ధర్మబద్ధులై, సత్యమును నమ్మికొన్న దయార్ద్రహృదయులగు హిందువులు-స్వార్థపరులగు సనాతనులు పెట్టు బాధలు సహించలేక, బ్రహ్మ సమాజమున చేరుచున్నారు. తెలిసినదా ? హిందూ మతము నందలి ముఖ్య సిద్ధాంతముల మీదనే, బ్రహ్మ, ఆర్య సమాజములు ఆధారపడియున్నవి. హిందూమతము నుండి వెలువడిన చీలికలే అవి - పూర్వాచారపరాయణుల అవినీతివలననే

హిందూమతమున కింతటి ముప్పు కలిగినది. సత్యస్వరూపమై,— అహింసా సిద్ధాంతమున కాది గురువై,— ధర్మనిలయమై, రాణించిన హిందూ మతము, యిప్పుడు కృత్రిమ వేషధారులవలన స్వస్వరూపమును గోల్పోవుచున్నది. నీతికి ధర్మమునకు అర్థము దెలియని పెద్దలీ నాడు కులపతులై శాసించుచున్నారు. మతము పేరు జెప్పి సత్యమును, ధర్మమును మంటగలుపుచున్నారు..."

"ఓహోహో! మీరుకూడా అరకంవారే!– సరే, సరే, ఇక పొండి – విధవముండలను పెళ్ళిజేసుకొనే బ్రహ్మసమాజపు ముండాకొడుకులకు ధర్మపన్నాలు మెండు – ఆ వాసుదేవరావొక......"

"అయ్యా! పిచ్చిపిచ్చి మాటలు నోటికివచ్చినట్లుమాట్లాడవద్దు. బ్రహ్మసమాజము వారెవరో, హిందువు లెవరో, మీకు అర్థము కాలేదు అర్థముకాని వన్నీ బూతు లనుకొనుట బుద్ధితక్కువ పని. వాసుదేవరావుగారు బ్రహ్మ స మా జ ము లో చేరలేదు. వారు పూజనీయులు – వారిని నిందించి పాపము కట్టుకొనకండి–"

"అబ్బో! పూజనీయులా? ఎవరికో! విధవలకా?"

"మీ దౌర్జన్యమునకు హద్దులేకుండా వున్నది. ఇలాగే మాట్లాడుతుంటే మీకు దేహశుద్ధి జరుగుతుంది. వాసుదేవరావుగారి కాలిగోరికి కూడా మీరు పోలరు. వారిని మీరా విమర్శించువారు? మర్యాదగా మాట్లాడితే తగిన సమాధానము చెప్పగలము. మీది శాస్త్రవాదమా? హేతువాదమా! లేక, రెండూనా? దేనికైనను సిద్ధమే! వచ్చి కూర్చోండి, తెలివి తేటలు చూచుకొనవచ్చును. –

ఇంతకూ వాసుదేవరావుగారిని నిందించవలసిన పని మీకేమున్నది? అంతటి నేరము ఆయనేమి జేసినారు? అన్నాతురలకు ఆహారమిడుట నేరమా? దిక్కులేని అనాథలను రక్షించుట పాపమా? మతము పేరు జెప్పుకొని మానవ సంఘ రక్తమును త్రాగుచున్న సంఘమును ధిక్కరించుట తప్పా?—"

అని అనుచుండగా పూర్వాచార పరులు కదలకుండా నిలువబడి వింటున్నారు. ఇంతలో ఆమార్గాన వెళ్ళుతూ, వస్తున్న ప్రజలు కొందరు అక్కడ గుమిగూడారు. వారిలో కొందరు, సనాతనలను నోటికి వచ్చినట్లు తిట్టారు. కొందరు సర్ది, ఆవచ్చిన పెద్ద మనుష్యులకు వాసుదేవరావుగారి యిల్లు చూపించారు.

దుర్మార్గుల వ్యతిరేక ప్రచారమువల్లను, దౌర్జన్యము వల్లనూ, వాసుదేవరావు గారి ప్రఖ్యాతి నానాటి కతిశయించుచున్నది. వాసుదేవరావంతటి ధర్మాత్ముడులేడనీ, ఆయన పుణ్యమున దిక్కులేని కుటుంబాలెన్నో సుఖ జీవనము చేయుచున్నవనీ, ప్రజ లనుకొనుచున్నారు.

గోదావరిజిల్లా నుండి వారు దర్శనార్థ మరుదెంచిన పెద్ద మనుష్యులను వాసుదేవరావుగారుచిత రీతిని ఆదరించిరి. వారారోజు దినమెల్ల వాసుదేవరావుగారింటనే యుండి, వారితో మాట్లాడిరి. ఆ వచ్చిన వారిద్దరిలో ఒకరు వల్లూరి సుబ్బారావుగారు, రెండవవారు, ఆయన స్నేహితుడు, సుబ్బారావుగారి రెండో అబ్బాయికి సుశీలను యివ్వవలసినదని అడుగుటకు వచ్చారు. వాసుదేవరావుగారికి

సుబ్బారావుగారితో యిదివరకే కొద్దిగా పరిచయమున్నది. సుబ్బారావుగారి రెండో అబ్బాయి నారాయణమూర్తి లండనువెళ్ళి I.C.S. చదివి వచ్చి యిప్పుడు నెల్లూరుజిల్లాలో, అసిస్టెంటు కలెక్టరుగా నున్నాడు. నారాయణమూర్తికి లండను వెళ్ళకపూర్వమే వివాహమయినది కాని, ఆ పిల్ల పరిణయమైన రెండు మాసములకే మరణించినది. సుబ్బారావుగారు సంపన్నులైనప్పటికీ, యీ సంగతి కొంత నలిగినట్లు చెప్పుకొన్నారు. మొత్తముమీద యీ సంబంధము అన్ని విధాల వాసుదేవరావుగారికి నచ్చినది. ఆయన భార్యకు కొంత అసంతృప్తిగా నున్నది. రెండో పెళ్ళి వానికామె [illegible] కిష్టపడుటలేదు. ఈ విషయము వాసుదేవరావుగారు సుశీలకు చెప్పి, ఆమె అభిప్రాయాన్ని చెప్పమన్నారు. ఆమె కొంతసేపాలోచించి "మొదటి భార్యతో ఆయన కాపురముచేయలేదుగద! ఆయనదోషమేమున్నది!" అని అన్నది. వాసుదేవరావుగారు సుశీల చెప్పిన సమాధానమునకు సంతోషించి, ఆసంబంధమే స్థిరపరచారు. సుశీలను చూచుటకు నారాయణమూర్తిని రావలసినదని తంతివార్త నిచ్చారు. కమలాకరరావును గూడా వెంటనే రావలసినదని జాబు వ్రాసి పంపారు.

మరుసటుదయాన రైలులో నారాయణమూర్తి వచ్చాడు. ఆపూట వాసుదేవరావుగారింట్లో వుండి అవసరమైన విషయాలు మాట్లాడుకొన్నారు. నారాయణమూర్తి సుశీల ఒండొరులను చూచుకొన్నారు. ఉభయులు సమ్మతించిన మీదట సంబంధము

నిశ్చయింపబడినది. సాధ్యమైనంత త్వరలో ముహూర్తములు పెట్టించవలసినదని వాసుదేవరావుగారన్నారు. సుబ్బారావుగారు, ఆయన స్నేహితుడు, నారాయణమూర్తి ఆ రాత్రి రయిలుకు వెళ్ళిపోయినారు.

రెండు దినములకు కమలాకరరావు మద్రాసునుంచి వచ్చాడు. అతడు వచ్చేవరకు పెళ్ళి ప్రయత్నాలు వేగంగా జరుగుచున్నాయి. వాసుదేవరావు కమలాకరానికి అన్ని సంగతులు చెప్పి, వివాహము నిశ్చయింపబడినదన్నాడు. సుశీలగూడా తనకు తోచిన మాటలు అన్నకు చెప్పుకొన్నది. కమలాకరము అంతా విని సంతోషించాడు.

ఆ సాయంకాలము వాసుదేవరావు కమలాకరమును వెంట పెట్టుకొని, తోటలోనికి వెళ్ళాడు. ఇద్దరు చల్లగాలి పీలుస్తూ తోట అంతా కలయదిరిగి, వచ్చి, ఒక చోట కూర్చొన్నారు. వాసుదేవరావు మాటల సందర్భములో కమలాకరానికి సీత సంగతి చెప్పాడు. సీత చాలా యోగ్యురాలనీ, ఆమెను వివాహమాడుట ఉత్తమమైన ధర్మమనీ, వాసుదేవరావు అన్నాడు. కమలాకరము అంతా శ్రద్ధతో వినయుడై విన్నాడు. వాసుదేవరావు "ఇది నీకు సమ్మతమేనా?" అని అడిగాడు. కమలాకరమునకు మితిలేని ఆనందము కలిగినది. ఒక క్షణ కాలమతడు తన ఊహానిర్మితమైన ప్రేమ సౌధోపరిభాగములలో సీతతో విహరించాడు. అతని సుఖ స్వప్నాలన్నీ సత్యమగుచున్న కాలము సమీపించినది. అతడెన్నాళ్ళ నుండో, అసాధ్యమనుకొని పరిత

పించుచున్న సీతా కరగ్రహణము నేడు సుసాధ్యమై, కరతలామలక మైనది. సమాధానము కొరకు తండ్రి కమలాకరమువంక జూచాడు. కమలాకరము చలించకుండా గంభీరముగా వుండి, "అన్ని సందర్భములలోను మీ ఆజ్ఞను శిరసా వహించు చుంటిని గదా! నన్నడుగు టెందులకు? మీ యిష్టము వచ్చినట్లు యేర్పాటు చేయండి. నా కది సంతోషమే-" అన్నాడు.

"మంచిది - ఈ సంగతి మీ అమ్మగారితో కూడా చెప్పి ఆమె అనుమతి తీసుకొనవలసియున్నది. సుశీల వివాహముతోపాటు సీతా కల్యాణము గూడ జరుపవచ్చును" అనుచు లేచి, వాసుదేవరావు కమలాకరమును రమ్మన్నాడు. ఇద్దరు గృహోన్ముఖులైనారు.

దినములు గడుస్తున్నవి. పెళ్ళి పనులతో వాసుదేవరావుగారిల్లు ఆనందనిలయమై పోయినది. ఆవరణమంతా, పాకలు పందిళ్ళు వేయించారు. రంగు కాగితాల పూలతో వివిధాలంకారాలు చేస్తున్నారు. ఆ అయిదు దినములు మంచి మంచి పాటకచేరీలు, హరికథలు, అవధానములు, యేర్పాటు చేసి, మేలైన వేడుకలు జరుపవలెనని వాసుదేవరావుగారనుకొన్నారు. పేరెన్నికగన్న కవులను చిత్రకారులను ఆహ్వానించి, సన్మానించదలిచాడు. దక్షిణాది నుండి, పలురకముల వాయిద్యములు, మేళములు పిలిపించారు. సర్వము సిద్ధమైంది. మంగళవారము రాత్రి ఒకటిన్నర గంటలకు సీతా కమలాకరరావులకు, సుశీల నారాయణమూర్తులకు వివాహములు జరుగును. పెళ్ళివారు, మిత్రులు రావలసిన వారందరు వచ్చారు.

వాసుదేవరావుగారి బంధువులు మిత్రులు రెండువందలకు పైగా వచ్చి చేరుకొన్నారు. వీరందరికి మర్యాద మన్ననలు సక్రమముగా జరుగుటకు తగిన యేర్పాటులు చేయబడినవి. సమయమునకు సరిగా, విధిగా, పరిణయమహోత్సవము ప్రారంభింపబడినది. మంగళ వాద్యములును, పండితాశీర్వచనములును, మిన్ను ముట్టినవి. తేజోమయమగు ఆపవిత్ర సుముహూర్తము సర్వజనానంద సంధాయకమై, విమలహృదయుల కొక దివ్య ప్రబోధము నొసంగినది.

ఆ గ్రామము నందలి ప్రముఖులనేకులు వాసుదేవరావు గారి పిలుపు నామోదించి వచ్చి, తమ సంతోషమును వెలిబుచ్చిరి. అయిదు దినములు అనుకొన్న ప్రకారము చక్కని వేడుకలు జరిగినవి. ఇతర గ్రామములనుండిగూడా ప్రజలు తండోపతండములుగావచ్చి ఉత్సవములందు పాల్గొని ఆనందించిరి. నేత్రోత్సవదాయకములగు కళ్యాణములను జూచుటకే మానవుడు రాడు ?

# పంథొమ్మిదవ ప్రకరణము



ఈనాడు హిందూ మతము నామమాత్రావశిష్టమై యున్నది. రానురాను జాతి చైతన్య రహితమై, సన్నగిల్లిపోయినది. ఒకప్పుడు మహోన్నత గుణోపేతుల కాలవాలమై,- నిరతాన్నదాన శీలురకు నిలయమై,- సత్యమూర్తులకు స్థానమై,- పరుల కష్టలేశమును సహింప నొల్లని, నవనీత కోమల హృదయములకు జన్మభూమియై,- రాణించిన హిందూ దేశము, సంకుచిత దృష్టిగల స్వార్థపరులచే నిండి విషాద పూరితమై,- ప్రళయ భీకరమై - పాపభూయిష్టమై పోవు చున్నది. ఆనాడు ఏకోదర సోదరులవలె మెలగిన హిందువులు; ఈనాడు ఒకరి నొకరు ద్వేషించుకొనుచు, రోషపీడితులై, క్రోధా వేశమున కన్నుగానక, నీతి నియమాలను గంగలో కలిపి, చేయరాని దుష్కార్యములను జేసి, తమకును మతమునకును హాని కలిగించు చున్నారు. అన్యాయము న్యాయము పేరున విక్రయించబడుచున్నది. శ్రీమంతుడేది చేసిన, నది న్యాయము. విశాల పరిజ్ఞానము నశించి. అతిథి సత్కార మదఃగంటి, జాతీయ జీవిత వికాసమే రూపహీనమై పోయినప్పుడు, హిందూమత పతనముగాక మరే మున్నది? మానవులు రాక్షసులై, పరదారాపహరణమునకు, పరవిత్తాపహరణమునకు, పరువు

లెత్తుచూ, అక్రమములకు, అసహజములకు పాల్పడుచుండ, మత మెక్కడ నిలుచును? సంఘ మెక్కడ బాగుపడును?

జీవితశోభను మరుగుపరుచుచున్న మత మెందుకు ? ఎవ్వరికి కావాలి?...సనాతనులు మతము పేరుజెప్పి, మానవసంఘమును పీల్చి వేయుచున్నారు. వా రాచరించు పనులుమాత్రమే ధర్మములనియు, మిగిలినవి అకృత్యము లనియు విపరీతార్థములు కల్పించి, కఠిన నియమాలతో ప్రజా సౌకర్యాలకు భంగము కలిగించారు. సమాజమున వారికి బలమున్నదిగదాయని గర్వముతో అమాయకులగు ప్రజలపై తమ కఠిన శాసనములను ప్రయోగించారు. ఇష్టమువచ్చినట్లు ధర్మశాస్త్రములను తారుమారు జేసి, అనుకూల పరిస్థితు లేర్పరచుకొని, సాంప్రదాయ విరుద్ధములై - అమానుషములైన ఆచారములను బలవంతముగ ప్రవేశపెట్టారు. అర్థము లేని ఆటంకములతో మతాభివృద్ధిని అరికట్టారు. ఆదరించి పోషించు రాజులు లేనందున, మారుతల్లిచే పెంపబడు బిడ్డవలె మతము దిగజారుచున్నది. ఈరాక్షస బాధలు పడలేని స్వల్ప సంఖ్యాకులు కొందరు, తమ బుద్ధిబలము నుపయోగించి, హిందూమతము నుండి ముఖ్య సూత్రము లను గ్రహించుకొని, మరియొక మత మేర్పరుచుకొన్నారు. అట్లే మరి కొందరు, మరికొన్ని సూత్రముల నాధారము చేసుకొని, వేరొక మతము నేర్పరుచుకొన్నారు. హిందువులై, పూర్వాచారపరాయణుల బాధలు పడలేక కొందరు యీ నూతన మతముల నాశ్రి

యించారు. ఈ విధంగా రానురాను హిందూమతము చీలికలయినది. ఆర్యసమాజము, బ్రహ్మసమాజము మున్నగునవి తల లెత్తినవి.

ఇప్పుడు హిందూ మతము నిర్జీవమైపోయినది. సత్యాన్వేషణ తత్పరులగు మహనీయు లేకోదిమందో వుంటారు గాని, అధిక సంఖ్యా కులు, నామ మాత్ర హిందువులే! సత్యము - ధర్మము - దైవము - మాటలలో గోచరించు చున్నదే గాని, నిత్యనైమిత్తిక జీవితమున వృగ్యము. ఆచరించు ప్రతి పనియందును, అనుక్షణము ప్రతిఫలింప వలసిన వేదాంతము, ఉపన్యాసములలో మాత్రమే దర్శనమిచ్చు చున్నది. తన ప్రయోజనమునకు మాత్రమే హిందువుడీనాడు, సత్య మూర్తివలె నటించు చున్నాడు. తనపని ముగియువరకే ధర్మపన్నములు జెప్పుచున్నాడు. తానొక్కడే లక్షాధికారి కావలెనని యితరులు తనతో సమానంగా వుండకూడదనీ, భగవంతుని ప్రార్ధించి కొబ్బరికాయలు కొట్టుచున్నాడు. తన భార్యకు కాసులపేరు కావల సినప్పుడో, తన పుత్రుడు రోగపీడితుడైనప్పుడో దేవాల యమునకు వెళ్ళి పూజిస్తున్నాడు. అంతేగాని, ఆకలిబాధచే అల్లాడుతున్న నిరుపేదగాని, దాహముచే అలమటిస్తున్న దౌర్భాగ్యుడు గాని, అతనికంటికగపడడు. ఇదియా హిందూమతము? హిందూమతమున యిందరు అన్నార్తులున్నారా? ఆనాటి నిరతాన్నదానసత్రములేమై నవి? ఎన్నికలుజరుపుకొను పోలింగు ఆఫీసులుగామారినవా? దిక్కు లేని వారికుపయోగపడవలసిన ధనమంతయు దీక్షలకొరకు, అవినీతికరము లైన యితరపనులకు ఖర్చుపడుచున్నదా?

సత్త్వవర్తనానురక్తి గల సుగుణసంపన్నులు కొందరుగా లేక పోలేదు. మతమును సంఘమును సమున్నతస్థితికి తెచ్చుటకు వారు తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నమాటనిజమే, గాని వారతిస్వల్ప సంఖ్యాకులు. అందువల్ల వారికృషికి దగిన ఫలితము గనుపించుటలేదు.

సూరయ్య చదువుకొనే కాలములో ఏవో, పద్యాలు వ్రాసి ప్రచురణార్థము పత్రికలకు పంపేవాడు. పత్రికాధిపతులు వాటిని ప్రచురింపక, నిరాకరించినందువల్ల, వాళ్లమీదగలిగిన క్రోధముతో, తాను ఒక మాసపత్రికను సాగించదలచుకొన్నాడు. అటుపిమ్మట కొంత కాలమునకు రాజకీయఖైదీగా జైలుకు వెళ్లినప్పుడు అతనికి జైలులో ప్రాచ్య పాశ్చాత్యవాఙ్మయ విహారధీరులగు పలువురు పెద్దల సాంగత్యము లభించినది. అచటి వాతావరణమతనికి విజ్ఞానోదయము కలిగించి కర్మఠునిజేసినది. అచిర కాలమున సూరయ్య స్వరూప స్వభావములే మారిపోయినవి. విద్యార్థిదశలో అతని కేర్పడిన కోర్కెలిపుడు లేవు. అతడు ప్రజాసేవజేసి తనజీవితమును పునీతము గావించుకొన దలిచాడు. అధోగతి పాలగుచున్న హిందూమతమునకు బలము చేకూర్చుట - అసహాయులై బానిసత్వమునబడియున్న అంధుల నుద్ధరించుట - ఈ రెండును అవశ్యాచరణీయములై, అతనికి గోచరించినవి. అతని కొందరిద్దరు ధనవంతుల సహాయ సంపత్తి లభించినది. ఎన్నడో అనుకొన్న మాసపత్రికగాక అతడిప్పుడు "హిందూమతము" అను పేరున ఒక వారపత్రిక సాగించాడు. ఒక వందమంది ప్రచారకులు చేయజాలని పని ఒక పత్రిక చేయుగలదని అతని నమ్మకము.

హిందూమతము నావరించియున్న దురాచారముల రూపుమాపి, సత్యమును, ధర్మమును, పునరుద్ధరించుట, మతమునకు సర్వతోముఖ మగు పుష్టి నొసంగుట – ముఖ్యాశయములు. అందుల కనుగుణ్య ముగ వ్యాసములు వ్రాయించుచు, అవసరమగు విద్యా ప్రబోధమును ప్రజలకు కలిగించ వలెనని అతడూహించాడు. ఇందుల కొక పత్రిక మాత్రమే గాక, అక్కడక్కడ సభల నేర్పాటుజేసి ఉపన్యాస ములిప్పించుట, ముఖ్య పట్నములలో కొన్ని సంఘముల నేర్పాటు జేసి, నిర్మాణ కార్యక్రమమును కొనసాగించుట–అతను చేయదలచిన పనులు. రెండవది, ఆంధ్రుల సమస్య – ఆంధ్రదేశమునకు చాలినన్ని జాతీయ కళాశాలలు, కర్మాగారములు నెలకొల్పుట – పరాధీను లైన ఆంధ్రులకు తగిన పనులను కల్పించి, స్వేచ్ఛాయుతమగు జీవితములిప్పించుట – తెలుగు మాగాణులలో చాలినన్ని ధర్మశాలలు అన్న సత్రములు, పుస్తక భాండాగారములు మున్నగునవి నిర్మించుట ఆంధ్రవీరుల జన్మదినోత్సవములు, విధిగా ప్రతి యింటను జరిపించుట వాణిజ్యాభివృద్ధికి, వ్యవసాయమును పెంపొందించుటకు, తగిన వసతు లతో కేంద్రముల నేర్పరచుట – ఇలాంటి పనులెన్నిగానో ఆచరించుట కారెడు తలపెట్టెను.

ఇన్ని పనులొక సామాన్యమానవుడు చేయ గలుగునా? ఎందరో వ్యక్తులు, యెన్నియేండ్లో చేసినను తీరని, కార్యభారమును నూరయ్య తన నెత్తి కెత్తుకొన్నాడు.

అసాధ్యములని వెనుకాడక, ప్రారంభించి పట్టుదలతో సాగిస్తే, కొన్నాళ్ళకైనా అతనికి ప్రజల నుండి సహకారము లభింపగలదనియు, నలుగురు మిత్రులు అతనికి చేయూత నిచ్చిన, అన్ని పనులు పూర్తి కాగలవనియు, అతని నమ్మకము. అతడీ పనులలో నిమగ్నుడై యుండుటవల్ల సీత వివాహమునకు గూడా రాజాలక పోయెను. అప్పుడతడు చెన్నపురిలో నున్నాడు. తాను రాజాలనందులకు చింతిల్లుచూ, వాసుదేవరావుగారి పేర జాబు వ్రాశాడు.

"హిందూ మతము" బెజవాడ నుండి బయలుదేరినది. ఇప్పటికి నాలుగు సంచికలు వెలువడినవి. అప్పుడె దేశమంతటను వ్యాపించి, పత్రికలు, ప్రజలలో సంచలనము కలిగించినవి. నిరంకుశమైన ప్రతిభతో సర్వాంగ సుందరంగా పత్రికనడుస్తున్నది. సంపాదకుని వాకచక్యమున కనేకులు మెచ్చుకొన్నారు. నూరియ్య శ్రేయోభిలాషులు పదుగురు అతనిని కొనియాడుచు, శక్తి కొలది విరివిగా చందాదారులను జేర్పించారు. హిందూమతము దేశమునుద్ధరించుగాక? యని మధురహృదయులగు కవులు, నాయకులు దీవించారు.

# పదమూడవ ప్రకరణము

జగన్నాటక సూత్రధారియగు మాధవుని లీల లనంతములు. ఆతడొకని నవ్వించి, మరియొకరి నేడ్పించును. ఏడ్పించినవారిని నవ్వించియు, నవ్వించిన వారిని ఏడ్పించియు, మానవుల నాడించుచుండును. ఈ విచిత్ర సంఘర్షణమునందే. పలువురు తత్వవేత్తలు, వేదాంతులు బయలు వెడలుదురు. ఇంత జరుగుచున్నను దూరాలోచన లేని మానవులు కొందరీ రహస్యాన్ని గ్రహింపజాలక, తమ శక్తి సామర్థ్యాలే, తమ యున్నత స్థితికి కారణాలని విఱ్ఱవీగుచుంటారు. ఏక్షణమున కేది సంభవించునో యెవరెరుంగుదురు? నిన్న లక్షాధికారిగా నున్నవాడు యీనాడు బిక్షాధికారి యగుట లేదా? దైవ నిర్ణీతములగు కష్ట సుఖాలు స్వల్పభేదాలతో అందరికి సమానమే గాని, గుణాగుణ నిర్ణయాలు యీ కష్ట సుఖాలలోనే జరుగును. సుఖదుఃఖాలు మానవుని పరీక్షించు ఒరపిడిరాళ్ళు. మానవుడెంత ఉన్నత స్థితికి వచ్చుచుండునో, అంతవిశాల హృదయుడై, త్యాగియై, సత్యమూర్తి కావలెను. అప్పుడే ఆ మానవుడు నిర్మలానందుడై తరించును. అతని జీవితము మంగళ ప్రదమై పునీతమగును. ఎన్ని బాధలు, చీకు చింతలు మానవుని ఆవరించి కష్టపెట్టునో, అతడంత శాంతుడై, వినయుడై, సన్మార్గాను వర్తియై, సంతోష చిత్తుడు గావలెను.

అప్పుడే అతనికి శుభోదయము కాగలదు. హిందువుల గొప్పతనమున కిది యొక నిదర్శనము. హిందువులు భోగభాగ్యాలను లక్ష్యపెట్టరు. వారికి కావలసినది ఉభయతారకమగు హృదయసౌందర్యము – తేజో మయమగు ఆత్మబలము.

కామేశ్వరరావు మొదటినుండి జాలిగుండె గలవాడె. అతడు స్నేహితులతో కలిసి మెలిసి వుంటూ, వాళ్ళ కష్టసుఖాలు తనవిగా భావించేవాడు. అత డెప్పుడు ఉత్సాహంతో విలాసంగా మాట్లాడు చుండేవాడు. అతనితో సంభాషించు టానందదాయకమని అతని మిత్రులు అనుకొనే వాళ్ళు. ఇప్పుడు కామేశ్వరరావు పెద్దవాడై, వ్యాపారము జేయుచున్నప్పటికీ, బుద్ధి మారలేదు సరిగదా, అంత కంతకు యోగ్యుడై పేరు ప్రతిష్ఠల నార్జించుకొంటున్నాడు. దయా నిధియగు శైవ మతనికి తోడుపడకుండునా ?

నాగమ్మ అత్తవారింటికి వెళ్ళి, భర్తతో కాపురము జేస్తున్నది. ఈ సంవత్సరము కామేశ్వరరావుకు వ్యాపారములో విరివిగా లాభ మొచ్చింది. నాగమ్మ వచ్చిన సంవత్సరమే కామేశ్వరరావుకు అధికంగా లాభం వచ్చుటచేత, నాగమ్మ అదృష్టవంతురాలను కొన్నారు. కామేశ్వరరావుకు చాలినంత ధనము లభించింది. ఇతరుల సహాయము లేకుండా యిప్పు డతడు స్వయముగా వ్యాపారము చేసుకోగలడు. బెజవాడలో వుండి చేస్తే వ్యాపారము బాగా సాగుతుందని కామేశ్వరరావుకు తోచి, పెద్ద మేడ అద్దెకుతీసుకొని బెజవాడలో కాపురము పెట్టాడు, ఒక మోటారు కారు కొన్నాడు,

కావలసిన హంగు లన్ని యేర్పడినవి. వ్యాపారము చక్కగా సాగుతున్నది. నాగమ్మ తెలివితేటలతో కాపురము జేస్తున్నది. ఇంటి వ్యవహారా లన్ని ఆమె చూస్తున్నది. ఆమె జీవితాకాశమున వెన్నెలలు అలముకొన్నాయి. శృంగారసాధి దేవతయై, భర్తను సంతసాంబుధి నోలలాడించుచూ, జీవితము నత్యంత రమణీయంగా జేస్తున్నది. ఆమె కమనీయ ముఖారవిందాన్ని చూడకుండా కామేశ్వరరావు వుండలేక పోతున్నాడు. దివ్య భోగా లనుభవిస్తూ, వినోదంగా కాలము గడుపుతున్నారు.

కామేశ్వరరావు సూరయ్యను అప్పుడప్పుడు కలుస్తుంటాడు. అవసరమైనప్పుడు సూరయ్య కతను కొంత ధన సహాయముకూడా చేస్తుండేవాడు. సూరయ్య ప్రతిభా సంపన్నుడని, తగిన దోహద ముంటే మంచి స్థితికి రాగలడని, కామేశ్వరరావు నమ్మకము. సూరయ్య కార్యక్రిమంలో కామేశ్వర రావు అప్పుడప్పుడు పాల్గొనేవాడు. కొన్నాళ్ళకు సూరయ్య అతనికి ప్రాణతుల్యుడయి నాడు. ఒకనాడు నాగమ్మ "సూరయ్యకూడా మన ఇంట్లోనే వుండగూడదా, ఒక్కడికొరకు మరియొక అద్దె కొంప యెందుకు?" అని భర్తతో అన్నది. "నిజమే! మన యింటికే అతనినిరమ్మంటాను" అని చెప్పి, కామేశ్వరరావు ఆ సాయంకాలమే సూరయ్యను వాళ్ళింటికి పిలుచుకొని వచ్చాడు.

ఆ నెలలో బెజవాడలోని యువతీ విద్యాలయానికి కార్య నిర్వాహకవర్గపు ఎన్నికలు జరిగినయి. పదిమంది మిత్రులు గలిసి,

సూరయ్యను ప్రెసిడెంటుగా యెన్నుకొన్నారు. సూరయ్య బెజవాడలోని ప్రముఖులలో నొకడయినాడు. అతనికి మంచి పలుకుబడి, గౌరవము లభించినయి. అతడు తన పెత్తనమున యువతీ విద్యాలయమును కట్టుదిట్టములతో సాగిస్తున్నాడు. పురుషులకు స్త్రీలకు ఒకటే రకమగు విద్య పనికి రాదని అతని నమ్మకము, స్త్రీలకు ప్రత్యేకించి ఒక విద్యావిధానమును యేర్పాటు జేశాడు. అందు, లలిత కళలు ముఖ్యమైనవి. కుట్టుపని, చిన్న చిన్న చేతిపనులు, యిలాంటివి ప్రవేశ పెట్టాడు. కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము మున్నగునవి నేర్పుటకు చక్కగా ఉత్తీర్ణులైన స్త్రీలనే నియోగించి, పురుషులెవ్వరు విద్యాలయమునకు రాకూడదని చెప్పాడు. సాధ్యమైనంతవరకు విద్యాలయమందలి బాలికలకు, వేషభాషలు జాతీయముగా నుండవలెనని శాసించాడు. విద్యాలయాభివృద్ధికి అవసరమగు అన్ని యేర్పాట్లుజేసి, ప్రతిపని తాను స్వయముగా చూచుకొనేవాడు. ముఖ్యమైన పండుగలకు, వార్షికోత్సవములకు అన్ని జిల్లాల నుండి గౌరవనీయులగు విదుషీమణుల నాహ్వానించి, సాంఘిక, రాజకీయ, మతాచారములను గూర్చి ఉపన్యాసముల నిప్పించేవాడు. సూరయ్య యీ విధంగా విద్యాలయాన్ని నడుపుచున్నాడు.

కొన్నాళ్ళకు సూరయ్యకు మరియొక ఆలోచన ఉదయించింది. బెజవాడలో ఒక అన్నసత్రము యేర్పాటు చేయవలెననుకొన్నాడు. వెంటనే ఈ సంగతి కామేశ్వరరావుతో చెప్పాడు. కామేశ్వర

రావు అందుకు సమ్మతించాడు. తానొక వెయ్యి రూపాయలు విరాళ మిస్తానన్నాడు. సూరయ్య ఆ చుట్టుప్రక్కల నున్న సంపన్నులను కొందరిని కలుసుకొని, మాట్లాడాడు. వాళ్ళుగూడా, సూరయ్య మాట కాదనలేక, తలకొక వెయ్యి, రెండువేలు, శక్తికొలది సహాయము చేస్తామన్నారు. అంతట సూరయ్య మరి కొందరు మిత్రులను కూడా తీసుకొని కొన్నాళ్లు తిరిగి, సొమ్ము వసూలు చేశాడు. మొత్తము యాభై వేలు వసూలు కాబడినయి. మంచి దినము చూచి, సత్రము కట్టుబడి, ప్రారంభించారు. సూరయ్య జాగ్రతగా దగ్గరవుండి పనిచేయించాడు రెండు మాసములలో సత్రము పూర్తిఅయింది. కట్టుబడికి పదివేలు ఖర్చు అయినయి. మిగిలిన నలభైవేలు మూలధనముగా వుంచి ఒక గుమాస్తాను, ఒక వంట మనిషిని పెట్టి, సత్రము సాగించారు. సత్రము యొక్క మంచి చెడ్డల నాలోచించుటకు, ఆయిదుగురు సభ్యులతో ఒక సలహా సంఘము నేర్పాటుజేశారు. ఆసంఘములో, సూరయ్య, కామేశ్వరరావు, మరి ముగ్గురు ఘనవంతులగు వర్తకులు వున్నారు. శ్రద్ధాభక్తులతో సూరయ్య తన శక్తి సామర్థ్యాలను వినియోగించి, సత్రాన్ని చక్కగా నడుపుచున్నాడు. సూరయ్య ప్రజ్ఞా విశేషముల కందరాశ్చర్య పడ్డారు.

నిష్కల్మష హృదయంతోను, నిష్కళాపేక్షతోను, చేయ తలపెట్టిన యే కార్యము కొనసాగదు! దైవ మట్టి వారి కనుకూలుడే గదా!

పత్రికాముఖమున సూరయ్యా కార్యక్రమము దేశదేశాలకు తెలిసిపోయింది. అతని కీర్తి చంద్రికలు నలుదిక్కుల వ్యాపించినయి. బొంబాయిలోని ఆంధ్రులు అతని నాహ్వానించారు. అచ్చట ఆంధ్ర సంఘము సక్రమముగను, సుస్థిరముగను స్థాపించుటకును తెలుగు వారికొక అన్నసత్రమును నిర్మించుటకు సూరయ్యా బొంబాయి వెళ్ళాడు.

## పదునాలుగవ ప్రకరణము

కమలాకరం చదువు పూర్తిఅయింది. మద్రాసులోనే ప్రాక్టీసు పెట్టవలెననుకొన్నాడుగాని, వాసుదేవరావందుల కిష్టపడలేదు. టేకూరికి సమీపములో వున్న పట్టణము బెజవాడ. అందువల్ల బెజవాడలో ప్రాక్టీసు చేయుటకు నిశ్చయింపబడినది. తాత్కాలికంగా గవర్నరుపేటలో ఒక మేడ అద్దెకు తీసుకొని, కమలాకరం అతని భార్య కాపురం వుంటున్నారు. మధ్య మధ్య వాసుదేవరావు వచ్చి చూచి, మంచి చెడ్డలు విచారించి పోతున్నాడు. కమలాకరము బెజవాడలో పెద్దమనుష్యులందరితోను పరిచయ మేర్పరచుకొన్నాడు ప్రతి నిత్యము క్లబ్బుకు వెళ్ళి టెన్నీసు ఆడుకొనేవాడు. అతడు టెన్నీసు చక్కగా ఆడగలడు. కొన్నాళ్ళ కతనికి గొప్పగొప్ప

అధికారులతోను, ధనవంతుల తోను స్నేహమేర్పడ్డది. అనేకులతని యొద్దకు సలహాలకు, చికిత్సలకు వస్తున్నారు. అందరు డాక్టర్లు ప్రయత్నించి, ఆశలు వదలుకొన్న యిద్దరు ముగ్గురు రోగులకు కమలాకరము చికిత్సజేసి బ్రతికించాడు. తదాది అందరు కమలాకరమునే వైద్యానికి పిలుస్తున్నారు. అచిరకాలమున అతడు మంచి డాక్టరని పేరు సార్జించుటే గాక, ధనము కూడా సంపాదించుచున్నాడు.

ఒక పర్యాయము వాసుదేవరావు బెజవాడవచ్చి ఒక వారము రోజులున్నాడు. అప్పుడు సూర్యయ్యనుకూడా తీసుకొని వచ్చి, నాగమ్మగారి యింటికి పంపించాడు. ఇప్పుడామె శాస్త్రి యొద్దనే వుంటున్నది. కామేశ్వరరావు నాగపూరునుండి అప్పుడప్పుడు కమలాకరముగారి యింటికి వస్తూపోతున్నారు. సూర్యయ్యకూ కామేశ్వరరావుకూ వాసుదేవరావు అవసరమైన సలహాల నిస్తుండేవాడు. సూర్యయ్యను వివాహము చేసుకొన వలసినదని వాసుదేవరావు కామేశ్వరరావు అనేక పర్యాయములు చెప్పారు. అతను "ఇప్పుడు కాదనియు, అసలే అవసరము లేదనియు" సమాధానాలు చెప్పుతుండేవాడు.

సూర్యయ్య బొంబాయి నుండి రాగానే వాసుదేవరావుగారి దర్శనము చేశాడు. ఆయన సూర్యయ్యతో వివిధ విషయాలు ముచ్చటించి, పిమ్మట సూర్యయ్యను పెళ్ళిచేసుకొనవలసినదని చెప్పాడు. అనేక విధాల నచ్చజెప్పి, సూర్యయ్య నందులకు సమ్మతింపజేశాడు.

ఈ సంగతి వాసుదేవరావు కామేశ్వరరావుతో గూడా చెప్పి, ఉభయులు కలిసి మంచి సంబంధాల కొరకు చూస్తున్నారు. సాధ్యమైనంత త్వరలో సూరయ్య వివాహము చేయవలెనని వాళ్ళిద్దరు పూనుకొన్నారు.

ఏదో మాటసందర్భములో ఒక నాడు కామేశ్వరరావు "ఎన్నాళ్ళు యీ అద్దె కొంపలలో వుండగలము? ఒక యిల్లు కట్టుకొంటే మంచిదిగదా" అని, వాసుదేవరావు గారితో అన్నాడు. అందుకయ్యే వ్యయములో తాను అర్థభాగము భరించుతానని గూడ చెప్పాడు. వాసుదేవరావుగారికీ ఆలోచన సమంజసముగా తోచింది. ఆయన కమలాకరముతో ఆలోచించాడు. తండ్రికొడుకులు, సాధకబాధకాలన్నీ మాట్లాడుకొన్నారు. సరే, నంటే సరే, ననుకొని గవర్నరుపేటలో స్థలముకొన్నారు. కామేశ్వరరావుగూడ సంతోషముగా కావలసిన రూపాయిలిచ్చాడు. గృహనిర్మాణానికి పూనుకొన్నారు. రూపాయలు చేతులోవుంటే ఈరోజుల్లో యేపనిగాదు? మూడు మాసాలలో అతి విశాలమైన బంగాళా తయారయింది. బంగళా చుట్టు ఆవరణములో ఒక వరుస కొబ్బరిచెట్లు వేయించి, అంతటా గులాబీ, మల్లె, చేమంతి, మున్నగు పూల మొక్కలు, అక్కడక్కడ అంటుమామిడిచెట్లు వేయించారు. అదంతా మనోహరంగా వుండి, వనలక్ష్మి కాలవాలమై, ఆనందదాయకంగా వుంది. గృహప్రవేశమునకు విశేషంగా ధనము వ్యయపరిచి బీదల కన్నదానము చేశారు. ఆరమ్య హర్మ్యానికి "సీతావిలాస్" అని

నామకరణము చేశారు. అందు ఒక భాగములో కమలాకరరావు కుటుంబమున్ను, మరియొక్క భాగములో కామేశ్వరరావు కుటుంబమున్ను, వేరొక భాగములో సూరయ్యా అతని తల్లిన్ని కాపురము వుంటూన్నారు. వాసుదేవరావు కిప్పుడు కనుల పండువుగా వున్నది. అతడు ఆ కుటుంబాల, నవలోకించి, బ్రహ్మానందమును బొందాడు. తన జీవితము తరించిన దనుకొన్నాడు. తన సంతాన మతి వైభవముగ సుఖోపేతులై, పేరు ప్రతిష్టల నార్జించు చున్నప్పుడు, యే తండ్రి ఆనందించడు! ఆ తండ్రికి వాంఛనీయ మింకే ముండును?

ఏకూరులో నిజగృహమును దిద్దుకొనుచు, వాసుదేవరావు భార్య యున్నది. అక్కడ గొడ్డు గోద, వుండి, పాడిపంటలతో తులతూగుచున్న సంసారము గదా ? అందువల్ల ఇందిర అక్కడే వుండి మంచిచెడ్డలను చూచుకొనవలసి వచ్చినది. వాసుదేవరావు కొన్నాళ్ళు బెజవాడలోను కొన్నాళ్ళు ఏకూరులోను వుంటూ, అవసరమగు పనులు చూస్తున్నాడు.

ఏకూరులో వున్న మాధవయ్యగారి యిల్లు విక్రయించవలసినదనియు, ఆ వచ్చిన సొమ్ములో కొంత తన బాకీ క్రింద తీసుకొని తనకు కొంత యివ్వవలసినదనియు, సూరయ్య వాసుదేవరావుగారిని యిదివరకే కోరినాడు. ఇప్పుడు ఆయింటికి బేరమువచ్చింది. పురాతనపు యిల్లుగనుక ఒక వెయ్యి రూపాయలే ధరవచ్చింది. సూరయ్యకు యీ విషయము తెలియజేసి, అతని యిష్టముమీద నే, ఆ యిల్లు విక్రయించి, వాసుదేవరావుగారు ఆ వెయ్యి రూపాయిలు సూరయ్య

కిచ్చాడు, సూరయ్య వాసుదేవరావుగారిని వారి బాకీ క్రింద కొంత మినహాయించికోవలసినదని చెప్పాడు. కాని వాసుదేవరావు అందులకు సమ్మతించక, సూరయ్య వివాహమునకా ధనము వినియోగపరచ వలసినదనియు. తన బాకీని గూర్చి యిప్పుడు ఆలోచించవలసిన పని లేదనియు చెప్పాడు. సూరయ్యగూడా ఒక యింటివాడయితే, తనకే కొరత వుండదని వాసుదేవరావు అప్పుడప్పుడంటుండేవాడు. సూరయ్యకు పిల్లనిచ్చుటకు యెవరు వెనుకాడుతారు? సూరయ్యపేరు యీనాడు అన్ని జిల్లాలలోను మారుమోగుతున్నది. అతడు బెజవాడలో చెప్పదగినవారిలో నొకడు. అంతటి ప్రతిభావంతుడు లేడని ప్రజలనుకొంటున్నారు. అలాంటి సూరయ్యకు యెవరు పిల్లనీయరు! బెజవాడలోనే ఒక సంపన్న గృహస్థు, తన పిల్లను సూరయ్య కిస్తాననివచ్చి వాసుదేవరావు గారితో మనవిజేసుకొన్నాడు. ఒకనాడు వాసుదేవరావు, రామేశ్వరరావు యిద్దరు వెళ్లి పిల్లను చూచి వచ్చారు. పిల్ల అందంగా వుంటుది. బాగా చదువుకొన్నది గూడాను. అన్నివిధాల బాగుందని, ఆ వారంలోనే ఒక ముహూర్తము బెట్టించి, సూరయ్యకు వివాహము జేశారు. పెళ్ళికి అందరు బంధువులతో పాటు నెల్లూరు నుండి సుశీల, నారాయణమూర్తి వచ్చారు. నారాయణమూర్తి నెల్లూరుజిల్లాలో అసిస్టెంటు కలెక్టరు హోదాలో నున్నాడు. దేశకాలపరిస్థితులను బట్టి నారాయణమూర్తికి నౌకరి చేయుట, నీచముగా తోచింది. అతడు తన జీవితాన్ని అందంగాను, ఆనందంగాను, నడుపవలెనని అనుకొన్నాడు. స్వాతంత్ర్య

ములోనే ఆ రెండు యిమిడివున్నయని, బానిసల కవి అందవని గ్రహించాడు. కాని యిప్పటివరకు యెలాగో కాలము గడిపాడు.

ఇప్పుడు బెజవాడలో సూరయ్య వివాహమునకు వచ్చిన నారాయణమూర్తికి, అతనిలో యిదివరకే అంకురించిన ఆలోచనలకు తగిన పాదు దొరకింది. అతడు కామేశ్వరరావును, కమలాకరమును సూరయ్యను చూచి, వారివలె తానుగూడ ముచ్చటగా జీవించుట మేలనుకొన్నాడు. తన ఊహ లన్ని భార్యతో చెప్పాడు. సుశీల ఆ మరునాడు, భర్త చెప్పిన సంగతు లన్ని తండ్రికి చెప్పి, ఆయన సలహాను కోరింది. వాసుదేవరావు సుశీల చెప్పిన మాటలన్ని విని వూరుకొన్నాడు, గాని యే విధమైన సమాధానము చెప్పలేదు. మౌనము అరంగీకారమని నారాయణమూర్తి అనుకొన్నాడు. తన కిష్టములేక తండ్రి మౌనము వహించాడని సుశీల భావించింది.

ఆ రాత్రి నారాయణమూర్తికి నిద్దురపట్టలేదు. అతనికి మాటి మాటికి దాస్యములో వున్న దీనత్వమూ, సేచ్ఛలోనున్న ఆనందము అనేక రకాలుగా, గోచరించినయి. ఒకె పర్యాయము మహా పురుషుల జీవితాలు కళ్ళకు కనిపించినయి. జీవితము క్షణభంగురమనీ, ఉన్న నాలుగు దినాలు స్వేచ్ఛగా తాను అనుభవిస్తూ, ఒకరి కింత పెట్టి పురుషార్థములు సాధించుటే గొప్ప తనమని అతనికి తోచింది. పరోప కారబుద్ధితో, సర్వము త్యజించిన మహిమాస్పద హృదయుల జీవిత మెంత రమణీయమైనదో గదా, అని అనుకొన్నాడు. ప్రేమించుటే మానవుని విధియని, అందరిని ప్రేమించి ఆదరించుటలో నున్న గొప్ప

తన మింకెందును, లేదని, అతడు భావించాడు, యెంత గొప్ప అధికారములోనున్నా, కొంత నీచత్వ మనుభవింపక తప్పదని, కొన్ని అబద్ధాలతోను, కొన్ని అక్రిమాలతోను, జీవితము పాపభూయిష్టము గాక తప్పదని అతడు నిశ్చయించుకొన్నాడు. ఎన్ని విధముల విచారించినా, అతనికి జానిసత్వము యెంత త్వరలో విసర్జించితే అంత మేలనిపించింది, ఎన్నెన్నో సమస్యలు అతని ఊహా పథమున కడ్డుతగిలినయి. అన్నిటిని పరిష్కరించుకొనుచూ, తీవ్రంగా విచారిస్తూ పడుకొన్నాడు. కొంతసేపటి కతనికి తెలియకుండానే నిద్రపట్టింది...

## పదునైదవ ప్రకరణము

సూరయ్య వివాహము కాగానే కరాచీ వెళ్ళి, క్రిందటి రాత్రే వచ్చాడు. అతడు అన్ని రాజధానీ, ముఖ్యపట్టణాలలోను, ఆంధ్ర సంఘాలను, అన్నసత్రాలను, పుస్తక భాండాగారములను నెలకొల్పు చున్నాడు. అన్ని ప్రాంతాలనుండి అతనికి ఆహ్వానాలు వస్తునంయి. కరాచీలో ఒక సంఘాన్ని పెట్టించి, ఒక అన్న సత్రము నిర్మించే యేర్పాట్లుజేసి వచ్చాడు. సూరయ్య తీవ్రప్రయత్నమువల్ల అన్న

దానము విరివిగా అన్ని ప్రదేశాలలోను జరుగుచున్నది. బీదలపాలిటి సూరయ్య కల్పతరువైనాడు. సూరయ్యను ప్రతి దినము వేలకొలది ప్రజలు చెప్పుకొంటున్నారు. అత డనుకొన్న పను లన్ని క్రమ క్రమంగా పూర్తి జేస్తున్నాడు. సంకల్ప శుద్ధిగలిగి, నిష్ఫలాపేక్షతో జేయు కార్యము లెందుకు కొనసాగవు ?

సుశీల యెంత జెప్పినా, వినకుండా నారాయణమూర్తి, తన యుద్యోగమును వదలుకొని, బెజవాడ వచ్చి కమలాకరంగారి యింట్లోనే వున్నాడు. " నిర్వ్యాపారత్వము, కాపురుష లక్షణము " అనిన్నీ. ఉద్యోగము చేయకపోయినప్పటికి, యేదో ఒక వ్యాపార మయినా చేయవలసినదని, నారాయణమూర్తికి వాసుదేవరావుగారు సలహా నిచ్చారు. "ఇంకొక వ్యాపార మెందుకు ? నా వ్యాపారము లోనే భాగమిస్తాను" అని అన్నాడు కామేశ్వరరావు - అందుకు అందరు 'సరే' నన్నారు. అప్పటినుండి నారాయణమూర్తి, పని వున్నప్పుడు వ్యాపారము జూచుకొంటూ, పని లేనప్పుడు సూరయ్య వెంట దిరుగుచున్నాడు. సూరయ్య అతనిని తన వెంట సభలకు తీసుకొని వెళ్ళుచుండేవాడు. " హిందూ మతము " నకు సంబంధించిన పనులను చూస్తుండమని నారాయణమూర్తికి సూరయ్య చెప్పాడు. కొన్నాళ్ళా విధంగా, సూరయ్య ఆతనికి పత్రికను నడుపు విధానము, ఇతర సంస్థలకు చేయవలసిన పనులు, మున్నగునవి నేర్పాడు. అన్ని పనులు యిప్పుడు ద్విగుణీకృతోత్సాహముతో



౧౩

జరుగుచున్నవి. "హిందూ మతము" దేశమంతటా వ్యాపించి, మంచి పేరు సంపాదించింది.

ఆనాడు ఆదివారమగుటవల్ల అందరు విశ్రాంతి దీసుకొనుచున్నారు. సాయంకాలము ఐదు గంటలు కావచ్చినది. "సీతావిలాస్" నందలి ఆవరణములో పచ్చిగడ్డిమీద, జీతగాడువచ్చి రత్నకంబళ్ళు పరిచాడు. అప్పుడే ఫలహారములు జేసి, అందరువచ్చి రత్నకంబళ్ళ మీద కూర్చొన్నారు. వాసుదేవరావు, కమలాకరరావు ఒక చోట కూర్చొన్నారు. వారికెదురుగా సూరయ్య, నారాయణమూర్తి, కామేశ్వరరావులు ఒక పంక్తిగా కూర్చొన్నారు. వారికి సమీపములో మెత్తటి చాపలమీద సీత, సుశీల, నాగమ్మ కూర్చొన్నారు. సుశీల సీతకు జడవేస్తున్నది, నాగమ్మ మల్లెపూలు దండలు కట్టుచున్నది. మలయపవనుడు నాగమ్మ ముంగురులతో దోబూచులాడుచున్నాడు. ఆ, ఆవరణములో పెరుగుచున్న పిల్లికూనలు రెండు, సీతమ్మ కాళ్ళ దగ్గర ఉల్లాసంగా ఆడుకొంటున్నాయి. అందరు సుఖోపవిష్టులై, యిష్టాగోష్ఠి సలుపుచున్నారు.

యువతీ విద్యాలయము, కిందటి సంవత్సరమున కంటె, ఈ సంవత్సరము సూరయ్య పరిపాలనలో చాలా బాగున్నదనీ, స్త్రీలకుచితమగు విద్య నేర్పబడుచున్నదనీ, నృత్య, క్రీడాది వినోదములు చక్కగా నేర్పుచున్నారనీ, ఈ మాటలు తాను అక్కడక్కడ ప్రజలు చెప్పుకొనుచుండగా విన్నాననీ, వాసుదేవరావు అన్నాడు.

"జ్ఞాన' విద్యాలయములోని బాలికలు, శారీరకంగాను, మానసికంగాను, చాలా అభివృద్ధికి వచ్చారు." అని నారాయణ మూర్తి అన్నారు.

అన్నసత్రాలను గూర్చి, కొంతసేపు కుశలాకరము మాట్లాడాము.

అటుపిమ్మట కామేశ్వరరావు వ్యాపారాన్నిగూర్చి తక్కిన వాళ్ళందరు మాట్లాడారు.

ఈ మాటలన్ని వింటున్న సీత "మీలోమీరు చాలా బాగా పొగడు కొంటున్నారు. ఇది అన్నిటికంటె బాగున్నది," అని అన్నది.

అందరు నవ్వుకొన్నారు.

ఆంధ్రుల స్థితిగతులను గూర్చి సూరయ్య చెప్పుటకు ప్రారంభించాడు. "నేటి ఆంధ్రులకు, ఆంధ్రులని చెప్పుకొనదగిన చిహ్నము లేమియు లేవు. ఆంధ్రులు నిలువ నీడకూడా లేకుండా వున్నారు. వీరికి ఆంధ్రమే కరువైపోయింది. తెలుగువారికి కావలసినన్ని పత్రికలు, గ్రంథమాలలు లేవు. తెలుగు వెలుగుల నెత్తి చూపగల సంచికలెన్నో కావలసి యున్నవి. ఆంధ్రుల కళాకౌశలమును పెంపొందించుటకు, వారి వ్యాపార వ్యవసాయముల నభివృద్ధిగావించి, సిరిసంపదలతోను, పాడిపంటలతోను తులతూగునట్లు చేయుటకు తగిన అవకాశాలు కల్పించాలి. ఆంధ్రులకు అవసరమగు అన్ని సామానులు, ఆంధ్రదేశములోనే తయారు కావాలి. తెలుగువారొకరిపై ఆధారపడి బ్రతుకరాదు. తెలుగునాడు తేజోవంతమైనదని

ఆంధ్రులు బలపరాక్రమ సంపన్నులనీ, విజ్ఞానవేత్తలనీ, మరియొక పర్యాయ మితరులకు చాటించాలి..."అని చెప్పుచున్నాడు.

వీరిట్లు సంభాషించుకొనుచుండగా, తలవని తలంపుగా, ముక్కోట అగ్రహారము నుండి, రామయ్యగారు వచ్చి, "సీతావిలాస్" ఆవరణములో ప్రవేశించాడు. ఆయననుచూడగనే వాసుదేవరావు గారు గుర్తుపట్టి, లేచివెళ్ళి, గాఢాలింగనము గావించుకొని, తీసుకొని వచ్చి సగౌరవంగా, ఉచితాసన మిచ్చాడు. అటుపిమ్మట రామయ్యను, సూరయ్య, సీతమ్మ, నాగమ్మ వరుసగా పోల్చు కొన్నారు. సీత వెంటనే లేచి లోని కేగింది. వాసుదేవరావు రామయ్యను పలుకరిస్తూ క్షేమసమాచారాలు అడిగాడు. ఆయన, అన్నింటికి తల వూపాడుగాని, మాట్లాడలేదు. రామయ్యకు నోట మాట రాలేదు. ఎందువల్లనో తడబడ బడుచున్నాడు. శరీరమంతా ముచ్చమటలు బోసింది. కమలాకరము వంకా, సూరయ్య వంకా, తేరి పారజూచాడు. తుట్టతుదకు తెప్పరిల్లి "వాసుదేవరావుగారూ! మీరు మహానుభావులు – మీ వంటివారు నూటికిద్దరుంటే హిందువుల కీ గతి పట్టదు. మీరు చేయించిన పనులు దేవతలుకూడా మెచ్చు కొన్నారు. మీలో ప్రజ్వరిల్లుచున్న త్యాగశక్తి, మిమ్మలను తపస్సంపన్నులను చేసినది. ఏనాడో పెంటదిబ్బలో పడిపోవలసిన నా కోడలును,...... కాదు, కాదు...... సీతమ్మను లక్ష్మీసమాను రాలినిగ జేసినారు......"అని అంటున్నాడు. ఆయన కనుల వెంట

ఆనందాశ్రువులు జలజల రాలినయి. వాసుదేవరావు ఆయనలోగిలిగిన మార్పున కాశ్చర్యపడ్డాడు.

"ఇంత స్వల్పకాలములో యెంత చిత్రమయినమార్పు? రామయ్య నిజంగా రామయ్య యేనా? ఆ మాటలు అన్నది రామయ్య యేనా?" అని అనుకొన్నాడు వాసుదేవరావు. రామయ్య మళ్ళీ ప్రారంభించాడు, "కమలాకరము వంటి కొడుకు, సుశీలవంటి కూతురు, సీతవంటి కోడలు, నారాయణమూర్తి వంటి అల్లుడు లభించుటకు మీరే పూజలు చేశారో? ఇలాంటి కుటుంబాలు ఆంధ్రదేశములో నాలుగుంటే ఆంధ్రులు విజయ ధ్వజము నెత్తరా? సూరయ్య వంటి ధీవిశాలురను, నారాయణమూర్తి వంటి ప్రతిభావంతులను గన్న ఆంధ్రమాత కింకే లోపముండును?......" అని ఆనందాతిరేకమున యేమేమో అంటున్నాడు.

ఇంతలో వాసుదేవరావు "ఎంతకాలమైంది మమ్ములను జూచి?" అన్నాడు,

"ఔను! ఇటీవల మీదర్శనమే లభించలేదు. మీచరిత్రంతా విన్నాను. అన్నసత్రము, యువతీ విద్యాలయము, మున్నగు వాటిని గూర్చి గూడా తెలుసుకొన్నాను. "హిందూమతము" చూస్తున్నాను. ఇన్నిటికి మూలకందము మీరేనని నానమ్మకము. నా సంతోషాన్ని ఆపుకొనలేక, తమను మనవి చేసుకొనదలచివచ్చాను. నాఆస్తి అంతా సీతమ్మకు కమలాకరమునకు స్వాధీన పరచినట్లు వ్రాయించాను. ఆ ఆస్తిని వారు వారి యిష్టమువచ్చిన ధర్మకార్యమునకు వినియోగ

పరచవచ్చును. ఒక్క పర్యాయము సీతమ్మను, కమలాకరమును చూచి పోవలెనని నా అభిలాష. ఆ దివ్యమంగళ స్వరూపములను జూచుటకు అవకాశమున్నదా?" అన్నాడు రామయ్య.

"అభ్యంతరములేదు - సీతా! ఇలారా!" అని వాసుదేవరావు పిలిచి, కమలాకరమును, "లేచి నమస్కరించమని" కళ్ళతో తెలియ జేశాడు. సీతమ్మ అడుగులు తడబడుచు వచ్చింది. కమలాకరము లేచి, సీతను పిలుచుకొని, ఉభయులు రామయ్యకు నమస్కరించారు. రామయ్య ఘనసార దీక్షించాడు. ఆతని హృదయములో దివ్యరాగ ముదయించింది. అప్పుడే వర్షపు తుంపురులు పడ్డయి.

రామయ్యగారి ధనముతో కమలాకరము, ఒక జాతీయ కళాశాలను నిర్మించి, "ఆంధ్రశ్రీ" అని ఒక పత్రికను కూడా సాగించాడు. రామయ్య యివన్నీ కళ్ళపండువుగా చూచి, సంతసించి, నిండుమనస్సుతో మరియొక పర్యాయము దీవించాడు.



"... జై! ఆంధ్రాభ్యుదయమునకు జై!!"

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B152 |
| పుస్తకం పేరు | హిందూమతము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | No |
| వెనుక అట్ట | No |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Preeti (yasl) |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |